శ్రీ

# మొల్లరామాయణము

ఇ య్య ది

ఆతుకూరి మొల్లచే రచియింపఁబడినది.



ప బ్లి ష రు:

కురుకూరి సుబ్బాశాస్త్రులు

సరస్వతీ బుక్‌డిపో, బెజవాడ.



## శ్రీరస్తు.

# మొల్లరామాయణము.



## బాలకాండము.





శ్రీమహిమాభిరాముఁడు వసిష్ఠమహాముని పూజితుండు సు
త్రామకధూకళాభరణుఁ డాశ్రితపోషకుండు దూ
ర్వామలసన్నిభాంగుఁడు మహాగుణశాలి దయాపరుండు శ్రీ
రాముఁడు ప్రోచు భక్తతతి రంజిలునట్లుగ నెల్లకాలమున్.

ఉ. శ్రీనగమందిరుం డమరసేవితుఁ డద్ధశశాంకమౌళి స
న్మునిమనఃపయోజదిననాయకుఁ డబ్జభవామరేశ్వర
ధ్యానలసత్ప్రసన్నుఁ డతిధన్యుఁడు శేషవిభూషణుండు వి
ద్యానిధి మల్లికార్జునుఁడు తా నిడు మాకు శుభంబు లొప్పగన్. 2

ఉ. తెల్లని పుండరీకముల తేజము మెచ్చని కన్నుదోయితో
నల్లని కల్కినీలరుచి నవ్వెడు చక్కని దేహకాంతితో
నల్లనఁ బిల్లఁగ్రోవి కరమందలి పంజ్ఞల నింపు నింపఁగా
గొల్లతలన్ విరాళితగఁ గొల్చెడు కృష్ణుఁడు ప్రోచుగావుతన్. 3

ఉ. మించి సమస్తలోకములు మిన్నక తాఁ దన నేర్పు మీఱ ని
ర్మించి పరిగ్రహతన్ మెఱసి మేలును గీడును బ్రాణికోట్లు సే
వించ ఘటించి శాస్త్రములు వేదములుం గొనియాడుచుండు వా
కాంచనగర్భుఁ డిచ్చు నధికంబుగ నాయువు నీప్సితార్థముల్. 4

సీ. చంద్రఖండకలాపుఁ జారువామనరూపుఁ, గలితచంచలకర్ణుఁ గమలవర్ణు
మేదురోజ్జ్వలబాహు మూషకోత్తమవాహు, భద్రేభవదను సద్భక్తసదను
సన్మునిస్తుతిపాత్రు శైలరాడ్దౌహిత్రు, ననుదినామోదు విద్యాప్రసాదుఁ
బరశువరాభ్యాసుఁ బాశాంకుశోల్లాసు, నురుతరఖ్యాతు నాగోపవీతు

గీ. లోకవందితగుణవంతు నేకదంతుఁ, నతులహేరంబు సత్కృపావలంబు
విమలరవికోటితేజు శ్రీవిఘ్నరాజుఁ, బ్రథితవాక్ప్రౌఢికై యెప్డుఁ బ్రస్తుతింతు. 5

చ. కరిముఖుడుం గుమారుండు వికారపుజేతల ముద్దునూపుచున్
గిరిసుత చన్నువాలుచు స్వరిగ గుబ్బలు గొట్టుచు జన్నుదోయితో
శిరమునఁ రాయుచుం గబరి జేర్చిన చంద్రుని బట్టి తీయఁగాఁ
గరమునఁ జూపనవ్వెడు జగన్మలతల్లి శుభంబు లీవుతన్. 6

ఉ. సామజయుగ్మ మింపలరఁ జల్లని నీరు పసిండికుండలన్
నేమముగాంచి కాంచి కడువేడుకతో నభిషిక్తఁ జేయఁగాఁ
దామరపువ్వుగద్దియ నురంబున నుండెడు లోకమాత మా
కామితలక్ష్మి సంపద లఖండముగా నిడు మాకు నెప్పుడున్. 7

ఉ. మేలిమిచంచుకాంతి నుపమింపఁగ జాలిన యంచ నెక్కి వా
హ్యాళినటించి వచ్చు చతురాస్యు నెఱుంగొని నవ్వు దేరగా
వాలిక సోగకన్నుల నివాళి యొనర్చి ముదంబు గూర్చి వి
ద్యాలయవాణి శబ్దముల నర్థములన్ సతతంబు మాకిడున్ 8

సీ. మునుసన్నుతాఖ్యాను సువివేకి వాల్మీకి, నఖిలవేదాగమాభ్యాసు వ్యాసు
ఘోరాంధకారపరిభారవి భారవి సత్కాంతిహిమకరశ్లాఘు మాఘు
వివిధకళాన్వితవిఖ్యాతి భవభూతి బ్రకటకార్యధురీణు భట్టబాణు
మానినీలోకసమ్మదభద్రు శివభద్రు గవితారసోల్లాసుఁ గాళిదాసు

గీ. స్తుతగుణోద్దాము వాచనసోము భీము, నవ్యమంజులవాగ్గుంఫ్య నన్నపార్యు
రసికుఁడైనట్టి శ్రీనాథు రంగనాథుఁ, దిక్కకవిరాజు నుతియించి ధీనిమించి. 9

క. తొల్లిటి యప్పటిసత్కవి, వల్లభులను రసికవినుత వాగ్విభవకళా
మల్లుల గవితారచనల, బల్లిదులైనట్టిఘనుల భక్తిఁ దలఁతున్. 10

క. గురులింగజంగమార్చన పరుఁడును శివభక్తిరతుఁడు బాంధవహితుఁడున్
గుణుఁ డాతుకూరి కేసయ, వరపుత్రిని మొల్ల యనఁగ వఱలినదానన్. 11

సీ. దేశీయపదములు దెనుఁగులు సంస్కృతుల్, సంధులు ప్రాజ్ఞుల శబ్దచితతి
శయ్యలు రీతులుఁ జాటుప్రబంధంబు, లాయాసమాసంబు లమరములను
భావార్థములుఁ గావ్యపరిపాకములు రస, భావచమత్కృతుల్ పలుకుసరవి
బహువర్ణములును విభక్తులు ధాతుల, లంకృతిచ్ఛందోవిలక్షణములుఁ

గీ. కావ్యసంపద క్రియలు నిఘంటువులును, గ్రియయు లేవియు నెఱుఁగ విఖ్యాతగోప
వరపు శ్రీకంఠమల్లేశు వరముచేత, నెఱిఁ గవిత్వంబు జెప్పఁగా నేర్చికొంటి. 12

క. చెప్పుమని రామచంద్రుఁడు చెప్పించిన పలుకుమీఁద జెప్పెద నే నె
ల్లప్పుడు నిహపరసాధన, మిప్పుణ్యచరిత- తప్పులెంచకుండ కవుల్. 13

వ. అని మఱియు.

చ. వలిపపుసన్నపయ్యెదను వానిఁగ గంధపుబూతతోడుతన్
గొలఁదిగఁ గానవచ్చువలిగుబ్బచనుంగవఠీవి నొప్పఁగాఁ
దెలుఁగని చెప్పుచోట గడుఁదేటలమాటల గ్రొత్తరీతులం
బొలుపు వహింపకున్న మఱి పొందగునే పటుహృద్యశబ్దముల్. 15

క. ఘనసంస్కృతముం దేటఁగఁ, దెనిఁగించెడిచోట నేమి దెలియక యుండన్
దనవిద్య మెఱయ గ్రమ్మఱ ఘనమగు సంస్కృతముఁ జెప్పఁగా రుచియగునే. 16

గీ. తేనె సోఁక నోరు తీయన యగురీతి దోఁడనర్థ మెల్లఁ దోఁచకుండ
గూఢశబ్దములను గూర్చినకావ్యమ్ము, మూఁగచెవిటివారి ముచ్చటగును. 17

క. కందుమాటలు సామెత లందముగాఁ గూర్చి చెప్ప నది తెలుఁగునకుం
బొందై రుచియై వీనుల, విందై మఱి కానుపించు విబుధులమదికిన్. 18

వ. అని మఱియు

క. ఆది రఘురాముచరితము నాదరముగ విన్న గోత్రమై లక్షణసం
పాదమ్మై పుణ్యస్థితి, వేదమ్మై తోఁచకున్న వెఱ్ఱిని చెప్పన్. 20

ఉ. రాజితకీర్తియైన రఘురాముచరిత్రము మున్ కవీశ్వరుల్
తేజ మెలర్పఁ జెప్పి రని తెల్సియు గ్రమ్మఱ జెప్ప నేనలన్

క భూజనకల్పకం బగుచు భుక్తికి ముక్తికి మూల మెనయా
రాజును దైవమై రఘురాము నుతించిన దప్పు గల్గునే. 21

క. వాగంగన శ్రీరాముని, పేరిడి రాచిలుక బిలిచి పెంపువహించెన్
నేరుపుగల చందంబున నారాముని వినుతిసేయ నాస్యము రాదే. 22

క. పేరిచి పొగడినవారిని నేరకకొనియాడువారి నిజకృప మనుపం
గారణమగుటకు భక్తియె కారణ మగుఁ గాని చదువు కారణ మగునే. 23

ఉ. సల్లలితప్రతాపగుణ సాగరుఁడై విలసిల్లి ధాత్రిపై
బల్లిదుఁడైన రామనరపాలకునిన్ స్తుతి సేయ జిహ్వకున్
జల్లర రాజలోకమును జేకొని మెచ్చఁగ నిచ్చవుట్టునే
నల్లము బెల్లముం దినుచు నప్పటి కప్పటి కాసనేయునే. 24

వ. అని వితర్కించి ముదంబున నిష్టదేవతాప్రార్థనంబును బురాతనకవీంద్రస్తుతియు
నుం జేసి నాచేయం బూనిన యెల్లరామాయణమునకు గథావిధానం బెట్టులనిన. 25

సీ. సరయూనదీతీరసతతసన్మంగళ, ప్రాభవోన్నతమహావైభవమ్ము
కనకగోపురహర్మ్యఘనకవాటోజ్జ్వల ప్రాకారగోపుర శ్రీకరమ్ము

గజవాజిరథభటగణితపత్రిచా, మరకేతుతోరణమండితమ్ము
ధరణీవధూటికాభరణవిభ్రమరేఖ, దనరించుమాణిక్య దర్పణమ్ము
గీ నానాకులదీపరాజన్యపట్టభద్ర, [illegible] సింహాసనమ్ము
వాఁ నుతికెక్కు మహిమ ననారతము. ధర్మశీలయమ్ము మహినయోధ్యాపురమ్ము.
సీ మదనాగయూథసమగ్రశైలము గాని, కుటిలవర్తన శేషకులము గాదు
ఆహవోర్వీజయహరినివాసము గాని, కీశసముత్కరాంకితము గాదు
మోహనగణికాసమూహగేయము గాని, యూధికానికరసంయుతము గాదు
గీ సగసత్పుణ్యజననివాసమ్ము గాని, కఠిననిర్దయదైత్యసంఘమ్ము గాదు
కాదు కాదని కొనియాడఁ గల్గినట్టి, పురవరాగ్రమ్ము సాకేతపురవరమ్ము. 27
సీ. భూరివిద్యాప్రౌఢి శారదాపీఠమై, గణుతింప సత్యలోకమ్మువోలె
మహనీయగుణసర్వమంగళావాసమై, పొగడొందు కైలాసనగమువోలె
లలితసంపచ్ఛాలిలక్ష్మీనివాసమై, యురవైన వైకుంఠపురమువోలె
విరచితప్రఖ్యాతహరిచందనాఢ్యమై యారూఢి నమరాలయమ్మువోలె
గీ. రాజరాజనివాసమై తేజరిల్లి, వరవరోత్తరదిగ్భాగనగరివోలె
సకలజనములు గొనియాడ జగములందు, బొలుపుమీరెను సాకేతపురవరమ్ము 28
క. ఇమ్ముల సప్పుర వప్రము, కొమ్మలపైనుండి పురము కొమ్మలవేడ్కన్
దమ్ములచుట్టముపసిజల, జమ్ముల పూజింతు రొగినజస్రముఁ బ్రీతిన్. 29
క. పరువున మరుపై యుండును, సురపురమునఁ గల్పతరులు చూపరకింపై
పరువున మరుపై యుండును, దురగంబు లయోధ్యఁ గలప్రితోళికలంచున్. 30
క. దానగుణమ్మున సురపురి, నేనాడును నమరరత్న మొక్క కెక్కున్
దానగుణమ్మున మిక్కిలి, యేనుగు లాపురములోన నెన్నిక కెక్కున్. 31
క. కవిగురుబుధమిత్రాదులు, వివిధార్చనల నమరపురి వెలయుచు రెలమిన్
గవిగురుబుధమిత్రాదులు, వివిధార్చనల నమరఁబురి వెలయుదు రెప్పుడున్. 32
క. భోగానురాగసంపద, భోగులు వర్తింతు రందు భూనుతలీలన్
భోగానురాగసంపద, భోగులు వర్తింతు రిందు భూనుతలీలన్. 33
సీ. ప్రకటానురాగ సంపన్ను లౌదురు గాని, రమణీయరుక్మతారకులు గారు
శుభపవిత్రోజ్జ్వలసూత్రధారులు గాని, టక్కరిహాస్యనాటకులు గారు
ఉభయసంధ్యాదివిధ్యుక్తకర్మలు గాని చర్చింపగా నిశాచరులు గారు
తిలకించిచూడ సద్వి[illegible] కాని, తలపంగ పక్షిజాతములు గారు

గీ. బాడబులు గాని యగ్నిరూపకులు గారు, పండితులు గాని విజ్ఞులపగిదిఁ గారు
ధీవరులు గాని జాతనిందితులు గారు, పరమపావను లాపురి ధరణిసురులు 34

ఉ. రాజులు కాంతియందు రతిరాజులు రూపమునందు వాహినీ
రాజులు దానమందు మృగరాజులు విక్రమకేళియందు గో
రాజులు భోగమందు దినరాజులు సంతతతేజమందు రా
రాజులు మానమందు నగరమ్మున రాజకుమారులందఱున్. 35

సీ. త్యాగదానవిఖ్యాతి ధరఁ గుబేరులు గాని, సతతాంగకుష్ఠపీడితులు గారు
నిర్మలసత్యోక్తి ధర్మసూనులు గాని, చర్చింప నవ్రతభావకులు గారు
ప్రకటవిభూతి సౌభాగ్యరుద్రులు గాని, వసుధపై రోషమానసులు గారు
కమనీయగాంభీర్యఘనసముద్రులు గాని, యాకులితభంగసంగతులు గారు
గీ. వర్తకులు గాని పశుజీవనులఁ గారు, భోగులే కాని పాము లెప్పుడును గారు
సరసులే కాని కొలకులజాడఁ గారు, వన్నెకెక్కిన యప్పురి వైశ్యులెల్ల 36

క. పంటల భాగ్యోదయులై, పంటలపైఁ బంటలమర బ్రతుకుదు రెపుడుం
బంటలఁ బాడియుఁ గలయా, పంటలు మొదలైన కాపుఁబ్రజలా నగరిన్. 37

సీ. కలికిమాపులచేత గరగింప నేర్తురు, బ్రహ్మచారుల నైన భ్రాంతిఁ గొలిపి
మృదువచోరచనల వదలింప నేర్తురు, ఘనమునీంద్రుల నైనఁ గచ్చడములు
వలపులపైఁ జల్లి వలపింప నేర్తురు, సన్యాసులను నైన జలము బట్టి
సురబంధమ్ములఁ జొక్కింప నేర్తురు, వ్రతములు గైకొన్న యతుల నైన
గీ. అచల మెక్కింప నేరుతు రౌవ ధనుల, నరులు గొలుపఁగ నేర్తురు మంత్రములను
ధనము లంకింప నేర్తురు తమ్ముఁ జేసి, వాసికెక్కిన యప్పురి వారసతులు. 38

సీ. శారదగాయత్రి శాండిల్య గాలవ, కపిలకౌశికులవిఖ్యాతి గలిగి
మదనవిష్వక్సేనమాధవ నారద, శుకనైజయంతి కార్జునులు గలిగి
చంద్రార్క గుహగిరిసంభవ జయవృష, కుంభబాణాదులు గోమగు మిగిలి
సుమనస్సురైరావత సురభిళ కామ్రవృత, పారిజాతముల సొంపారఁ గలిగి
గీ. బ్రహ్మనిలయమ్ము వైకుంఠపట్టణమ్ము, నాగకంకణుశైలమ్ము నాకపురము
లలితగతిఁ బోలి యోవేళఁ దులతుదూఁగి, ఘనత నొప్పారు నప్పురివనము లెల్ల. 39

చ. కనకవిలాసకుంభములు గబ్బిమదంబులలీలఁ జత్రికే
తనములు పైఁటకొంగులవిధంబున గ్రాలగ వాతము లొప్పిహిన్
గనుగవయట్లు పాల్పెసగ గా భువి భోగులు మెచ్చ భోగినీ
జనములరీతిఁ జెల్వమరు సౌధనికాయము పాయకప్పురిన్. 40

గీ. కుంభిని కాంత తనమీఁది కూర్మి విడిచి, ప్రకటరాజన్యమస్తకాభరణమకుట
చారుమాణిక్యదీపిత చరణుఁడైన దశరథాధీశుభుజపీఠిఁ బగిలియుంత. 48

క. ఆ రాజు రాజ్యమందలి వారెల్లను నిరతధర్మతత్పరు లగుచున్
భూరిశ్రీవిభవంబుల, దారిద్ర్యం బెఱుఁగ రెట్టితఱి నాదగన్. 49

వ. ఇట్టి మహాధైర్యసంపన్నుండును మహైశ్వర్యధుర్యుండు నగు దశరథమహారాజు
సకలసామంతరాజలోకపూజ్యమానుండగుచు సామ్రాజ్య మగు రాజ్యంబు నేలుచు
నొక్కనాఁడు. 50

సీ. సంతానలబ్ధికై చింతించి చింతించి, శిష్టచరిత్రుఁడౌ వశిష్ఠుఁ జూచి
తమకోర్కి వినుపింప విని మునిసింహుండు, పలికె బుష్యశృంగు నెలమిఁ బేర
ఘనుఁ డాతఁ డొగి బుత్రకామేష్టి యను పేర, యాగమ్ము గావింప నందువలన
వినుతికెక్క గజాలుతనయులు గలుగుదురు, సిద్ధమ్ము నామాటబుద్ధిలోన
గీ. నిలుపుమని చెప్ప నా రాజు నెమ్మనమున, నమితమోదమ్మున విభాండకునితనయుము
నెలమి రావించి పుత్రకామేష్టి యనెడి, జన్నమొనరించు చున్నట్టి సమయమునను. 51

ఉ. రావణుచేతిబాధల నిరంతరమున్ బడి వేడి మూకలై
దేవత లెల్ల గీష్పతికిఁ దెల్లముగా నెఱిఁగింప వారి రా
జీవతనూజుఁ డున్నెడకు శీఘ్రమె తోడ్కొనిపోయి చెప్ప నా
దేవుఁడు విష్ణుసన్నిధికి దిగ్గన జేకొనిపోయి యచ్చటన్. 52

వ. అప్పురాణపురుషోత్తముం గాంచి నమస్కరించి యింద్రాదిదేవతలం జూపి బ్రహ్మ
యిట్లని విన్నవించె. 53

ఉ. రావణుఁ డుగ్రుఁడై నపరాక్రమశక్తిని వీరసంపదల్
వావిరి గొల్లలాడి త్రిదివంబును బాడుగఁ జేయ నేఁడు నీ
పావని దీనభావమున నక్కట యుండఁగ నోశిభితిచే
దేవర గావవచ్చె నిఁక దేవరచిత్తము నీరభాగ్యముల్ 54

వ. అని విన్నవించిన విని వనరుహలోచనుండు దయాయత్తచిత్తుండై యమ్మహా
వాయమునిం గూర్చి యిట్లానతిచ్చె 55

గీ. వనజగర్భునిగూర్చి రావణుఁడు మున్ను, తపము సేసిన వరమిచ్చుతఱిని దనకు
సురిచేఁ జావు లేకుండఁ గోరినాఁడు, నరుల వానరులను జెప్పమఱచినాఁడు 56

వ. అక్కారణంబునం జేసి 57

గీ. వనమాలి గాను మనకు రావణు నిజంప వినుఁడు మీరెల్ల నామాట వేడ్కమీఱ
దశరథుండను రాజు సంతానకాంక్ష, నావర జన్నంబు గావింపుచున్నవాఁడు 58

క. ధరణీపతి యగుదశరథ, వరనాయకునింటఁబుట్టి నరరూపమునన్
దొరికొద నేనిక మీరును సురకంటకుమీఁదలావుఁ జూపుటకొఱకై. 60

క. కొందఱు కపివంశంబులఁ గొందఱు, భల్లూకకులమున గురుబలయుతులై
కొందఱు నన్ని తెఱంగుల, బృందారకులార! పుట్టి పెరుఁగుడు భువిపై. 61

వ. అని కృపాధురీణుం డైననారాయణుం డానతిచ్చిన వినివనజాసనాదిదేవతానికరం బవ్వనజోదరుని పాదారవిందమ్ములకు వందనమ్ము లాచరించి నిజనివాసమ్ములకుం జని రయ్యవసరమ్మున.

మ. ఇలసాకేతన్నపాలశేఖరుఁడు దా హేలావిలాసంబుతో
ఫలకాంక్షన్ సవనంబు సేసినయెడన్ బంగారుపాత్రమ్ములో
పలదుగ్ధాన్నము చాలనించుకొని తాఁ బ్రత్యక్షమై నిల్చి ని
ర్మలతేజంబున బావకుండనియె ప్రేమన్ మంజువాక్యంబులన్. 62

క. భూపాల! నీదుభార్యల, కీపాయస మిమ్ము తనయుల్
శ్రీపతిపుత్రసమానులు, రూపసు లుదయింతు రమితరూపస్ఫూర్తిన్. 63

వ. అని చెప్పి యప్పాయస పాత్రంబు చేతికిచ్చిన. 64

గీ. పాయసమ్ము రెండుభాగములు గావించి యగ్రసతుల కీయ నందులోన
సగము సగము దీసి సుగుణ సుమిత్రకు, నొసఁగిరంత నామె మెసవెఁ బ్రీతి. 65

వ. అంతం గొన్ని దినంబులకు గౌసల్యా కైకేయీసుమిత్రలు గర్భవతులై యొప్పారుచుండ. 66

సీ. ధవళాక్షు లనుమాట తథ్యంబు గావింపఁ, దెలివెక్కెఁ గన్నులు తేటలయ్యె
నీలకుంతల లని నెగడినయామాట, నిలుపంగ నెఱులపై నిలువునాపె
గురుకుచ లనుమాట సరవి సంభాషింపఁగ, దోరమై కుచములు దొరసినట్లై
మంజుభాషిణు లనుమాట తప్పక యుండ, మెలఁతల పలుకులు మృదువులయ్యెఁ

గీ. కామినులు లటంట నిక్కమై కాంతలందు, మీఁటిమేలైనరుచులపై గోరి కయ్యెఁ
సవతి పోరనదములోన సారెసారె, కోకిలింతలు బెట్టుచిట్టుములుఁ బుట్టె. 67

వ. మఱియును.

సీ. తనుమధ్యలనుమాటఁ దప్పింపఁగాఁబోలు, బొఱలేక నడుములు పొదలఁ జొచ్చెఁ
గుచములు బంగారుకుండలో యనుమాట, కల్లగా నగ్రముల్ నల్లనయ్యెఁ
జంద్రాస్యలనుమాట సరవిమాన్పఁగఁబోలుఁ గళలవిలాసమ్ము పలుచనయ్యె
సుందరు లనుమాట సందియమ్ముగఁబోలు, గర్భభారమ్ములఁ గాంతిదప్పె

గీ. ననుచు గనుగొన్న వారెల్ల నాడుచుండఁ, గట్టుచీరెల వ్రేకంబు పుట్టుచుండ,
నాసతులఁజూచి యందరు నలరుచుండఁ గాంతలకు నప్డుగర్భముల్ గానుపించె.

వ. ఇట్లు దుర్భరంబులైన గర్భంబులు దాల్చి కౌసల్యాది కాంతాత్రయమ్ము నా చైత్రమా
సమ్మున శుక్లపక్షమ్మున నవమీ భానువాసరమ్మున బునర్వసునక్షత్రంబునఁ గర్కాట
లగ్నంబున శ్రీరామ భరత లక్ష్మణ శత్రుఘ్నులం గాంచి రందదనంతరంబున దశర
థుండు యథోచితకర్తవ్యంబులు జరిపి యప్పదిదినంబులు నరిష్టంబులేక ప్రీతిదినప్ర
వర్ధమానులగుచున్న కుమారచతుష్టయంబునకు నాలోచితంబులగు చౌలోపన
యనాది కృత్యంబులు గావించి వెండియు ద్వ్యాప్రవీణులగునట్టు లాలధ్విగజా
శ్వరథారోహణంబులు నేర్పి ధనుర్వేదపారగులం గావించి పెంచుచున్న సమ
యమ్మున.

సీ. ఒకనాడు శుభగోష్ఠి నుర్వీశ్వరుడు మంత్రి పురోహితులను నెలమిఁజేరి
బంధువర్గము రాయబారులఁ జారులు బచారకులు నెల్లసరవిఁ జేరి
గాయకులు భృత్యగణములు మిత్రులు సతులును సుతులును జక్కనలరి
సరసులు జతురులు బరిహాసకులు గళా, వంతులుగడు నొక్క వంకఁజేరి

గీ. కొలువ గొలువున్నయెడ వచ్చి కుశికపుత్రుఁ, డర్ఘ్యదీవించి తా వచ్చినట్టి కార్య
మధిపునకు జెప్ప మదిలోన నాత్రపడుచు వినయమేపార నిట్లని విన్నవించె 71

క. రాముడు దనుజులతో సంగ్రామము సేయఁగఁ గలఁడె కందు గదా నే
నేమిమ్ము గొలిచివచ్చెద నో మునిరాజేంద్ర! యరుగు ముచితప్రౌఢిక. 72

మ. అనినం గౌశికుఁ డాత్మ నవ్వి వినుమయ్యా రాజనీచేతనా
ధన గాదైనను రాక్షసుల్ విపులగర్వాటోపబాహాబలుల్
ఘనుఁడీ రాముఁడు దక్క వారి గెలువంగా రావె పిన్నంచు నీ
వనుమానింపక పంపుమింక గ్రతురక్షణార్థంబు భూనాయకా.

వ. అని ప్రియోక్తులు పలుకుచున్న విశ్వామిత్రునకు మిత్రకులపవిత్రుండైన దశర
థుండు మాఱాడ నోడి యప్పుడు.

క. మునినాథు వెంట సుతాత్రి మూని నలజడి పెట్టుచున్న మూర్ఖులపై తా
ముని సౌమిత్రిని వెస నమ్మునితో నానందవార్ధిమునుఁగుచు బనిచెన్ 73

మత్తకోకిల.

వారి దోడ్కొని కౌశికుం డటు వచ్చునయ్యెడ ఘోరకాం
తారమధ్యమునందు నొక్కతె దైత్యకామిని భీకరా

కార మొప్పఁగ నట్టహాసవికాస మేర్పడ రాఁగ నా
ఘోరగాత్రునిఁ జూచి యమ్మునికుంజరుం డొగి రామునిన్

క. తాటక వచ్చిన దదిగో నాటఁగ నాఁడు దని మేల యాడక నీ వీ
పాటి కడ సేయు మని తన, చాటు నభయపడెడి రామచంద్రున కనియెన్. 77

వ. ఇట్లు చెప్పిన యామునిచంద్రునిపలుకు లాలించి రామచంద్రుండు తన యంతరంగమ్మున నిట్లని వితర్కించె.

క. ఈయాఁడుదానిఁ జంపఁగ నాయమ్మున కేమిగొప్ప నగరే వీరుల్
చీ యని రోయుచు నమ్ముని, వాయకు భయమెఱిఁగి తనను నమ్మి పలుకన్. 79

క. వేటు గొని రామచంద్రుఁడు నాటిగ నొకదిట్టకోల సురలు నుతింపన్
ఘోటక సమవక్షస్థలఁ దాటక సహ్యాగ్రిలీల ధరపైఁ గూల్చెన్ 80

వ. ఇట్లు తాటకం గీటణంచినయంత నమ్మునీంద్రుండు మేటిసంతోషమ్మున రాముని గొనియాడుచు నశ్రమంబున నిజాశ్రమంబున కేతెంచి రామసౌమిత్రుల సాయంబున జన్నంబు సేయుచున్న సమయంబున.

క. ఆకాశవీధి నెలకొని రాకాసులు గురిసి రమితరక్తముఁ బలలం
బాకౌశికుయజ్ఞముపై భీకరముగ మునిగణంబు భీతిం బొందన్ 81

ఉ. అంబరవీధి నిల్చి త్రిదశాంతకు లెంతయు రేఁచి రక్తమాం
సంబులు గాధినందనునిజన్నముపైఁ గురియంగ నంతలో
నంబరరత్న వంశకలశాంబుధి చంద్రుఁడు రామచంద్రుఁడు
గ్రొంబుగఁ ద్రుంచెఁ జండబల గర్వులఁ దమ్ముఁడుఁ దానునొక్కఁడై 83

వ. ఇట్లు రామచంద్రుడు సాంద్రప్రతాపంబు మించ నింద్రారులఁ ద్రుంచిన నమ్మునిచంద్రుఁడు నిర్విఘ్నంబుగా జన్నం బొనర్చిన రామసౌమిత్రులం బూజించె నట్టి సమయమ్మున.

క. ధరణీసుత యగుసీతకుఁ బరిణయ మొనరింప జనకపార్థివుఁ డిల భూ
వరసుతుల రండని స్వయంవర మొగి జాటించె నెల్లవారలు వినఁగన్ 85

వ. ఇట్లు స్వయంవరమహోత్సవఘోషంబున సంతోషమ్ము నొంది విశ్వామిత్రుండు రామసౌమిత్రుల మిథిలానగరంబునకుఁ దోడ్కొని చనుచుండు మార్గంబున. 86

క. ముదితాపసి వెను వెంటను వదలక చనుదెంచునట్టివడి రాముని శ్రీ
పదరజము సోఁకి చిత్రం, బొదవక గనుపట్టె నెదుట నొకయుపల ప్రతిమన్ 87

క. పసనై యొప్పిద మొకమును గదలుచు బంగారుపూదె కరిగినరీతిన్
బొదలుచు లావణ్యస్థితి సుదతిగ జూపట్టి నిలచె సురుచిరలీలన్ 89

ఉ. అమ్మునివల్లభుండు గొనియాడుచుఁ బాడుచు వేడ్కతోడ శ్రీ
రాముని జూచి యిట్లనియె రామ భవత్పదధూళి సోఁకి యీ
భామినిరాయి మున్ను కులపావన చూడగ జిత్రమయ్యె నీ
నామ మెఱుంగువారలకు నమ్మఁగ వచ్చును భుక్తిముక్తులున్. 89

వ. అని యక్కాంతారత్నంబు పూర్వవృత్తాంతం బంతయు నెంతయు సంతసమ్మున
నమ్మనుజేంద్రనందనుల కెఱిగింపుచు మిథిలానగరంబునకు జనియె నచ్చట 90

సీ. ద్రవిడ కర్ణాటాంధ్రయవన మహారాష్ట్ర, రాజకుమారులు చాల తేజ మలరఁ
బాండ్యఘూర్జరలాటబర్బరమళయాళ, భూపనందనులు విస్ఫూర్తిమీఱ
గౌళ కేరళసింధు కాశకోసలసాళ్వ ధరణీశపుత్త్రుల సిరి వెలుంగ
మగధమత్స్యకళింగమాళవనేపాళ, నృపతనూభవులు నెన్నికకు నెక్క

గీ. మఱియు నుత్కలకొంకణమద్రపాండ్ర వత్సగాంధార సౌరాష్ట్రవంగచోళ
రాజ్యముల నొప్పుఛప్పన్న రాజసుతులు వచ్చిరక్కామినీస్వయంవరమునకును. 91

ఉ. కొందఱు పల్లకీల మఱికొందఱు తేజుల నందలంబులన్
గొందఱు కొందఱశ్వంబులఁ గొందరు మత్తగజేంద్రసంఘముల్
కొందరు స్వర్ణడోలికల గోరిక నెక్కి నృపాలనందనుల్
సందడి గాఁగ వచ్చిరి భుజంబు భుజంబును ద్రోపు లాడఁగన్. 92

వ. అట్టిసమయంబున.

చ. గురుభుజశక్తి గల్గుపదికోట్లజనంబుల బంప వారు నా
హరునిశరాసనంబుఁ గొనియాడుచు బాడుచుఁ గొంచువచ్చి సు
స్థిరముగ వేదిమధ్యమునఁ దేర్చిన దానికి భూపధీపముల్
విరులును గంధ మక్షతలు వేడుక నిచ్చిరి చూడ నొప్పగన్. 94

వ. అట్టిసమయంబున జనకభూపాలుండు రాజకుమారులం గనుంగొని యిట్లనియె. 95

ఉ. కొంకక సావధానమతిఁ గూర్చి వినుండిదె మత్కుమారికై
యుంకువ చేసినాఁడ వివిధోజ్జ్వల మైనధనంబుఁ గావనీ
శంకరుచాప మెక్కిడిన సత్త్వఘనుం డగువాని కిత్తునీ
పంకజనేత్రి సీత నరపాలకులార నిజంబు చెప్పితిన్ 96

గీ. అనుచు బలుకుచున్న యవనీశతిలకుని, వాక్యములకు నుబ్బి వసుమతీశ
సుతులు రాముతామె మదిలోన వెలగుచు దగ్గిరంగ బోయి దమవుఁ జూచి. 97

క. విల్లా యిది కొండా యని తల్లడపడి సంశయంబు తలకొన మదిలో
బల్లిదు లగునృపనందనులు, లెల్లరు దౌదవుల నూడి రెంతయు భీతిన్

క. కొండలుదగ్గగ నోడిరి, కొందఱు సాహసము చేసి కోదండముతో
 దండి వెనగి పాటిరి, సందుల గొందులను దూరిసత్త్వము లేమిన్

సీ. ఆలింపఁగాలికరీతిగా నెత్తఁ జాలక తముఁ దామె సిగ్గునదలలు వంచి
కౌగిలించిన లోను గాక దగ్గల మైన భీతిచే మిక్కిలి బీరువోయి
కరముల నందంద పారలిచ్చి చూచిన గదలకయున్న జీకాకుపడుచు
పాషాణ మున్నట్టిపగిది మార్గవ మేమి కాన రాకుండిన గళవళించి

గీ. రాజసూనులుకొందఱు తేజ ముడిగి జగతిరాజులు మోసపుచ్చంగ దలచి
 కుడిచియాయు గావించె జాలుననుచు దలగి పోయిరి దవ్వుగా ధనువువిడిచి

సీ. ఇది పర్వతాకార మీవిల్లు కను విచ్చి దేరిచూడగ గాదు దేవతలకు
నటు గాక మును శేవకటుకునిధను వంటు వారుడె కావలె గాక వారియుగాక
తక్కినవారికి దరమె యీకోదండ మెత్తంగ దగుచేవ యెట్లుంగలుగు
దీనిదగ్గర కేల దీని కోడగ నేల పరులచే నవ్వులు పడగనేల

గీ. గురుతు సేసియు దమలావుకొలది దామె తెలియవలెగాక యూరకతివురనేల
 యొకుల సొమ్ములంతమకేల దొరకుననుచు దలగిపోయిరి రాజనందనులు గనుచు

వ. అంత విశ్వామిత్రమునీంద్రుడు రామచంద్రుని ముఖావలోకనంబుఁ జేసిన. 102

ఉ కదలకుమీ ధరాతలము కాశ్యపి బట్టు ఫణీంద్ర భూవిషా
స్పదములను బట్టు కూర్మమ రసాతలభోగిఢులీఢులీకులన్
వదలక పట్టు ఘృష్టి ధరణీఫణికచ్ఛపపోత్రివర్గమున్
బొదవుచు బట్టుడీ కరులు భూవరు డీశునిచాప మెక్కిడున్.

క. ఉర్వీనందనకై రా మోర్వీపతి యెత్తు నప్పు డుగ్రునిచాపం
 బుర్వి బట్టుడు దిగ్దం త్యుర్వీధరకిటిఫణీంద్రు లూతగ గడిమిన్. 104

వ అనుచు లక్ష్మణుఁడు దెలుపుచున్న సమయంబున. 105

మ ఇనవంశోద్భవుడైనరాఘవుడు భూమీశాత్మజాల్ పేడ్కతో
 దను వీక్షింప మునీశ్వరుండలర గోదండంబుచేనంది చి
 వ్వన మోపెట్టి గుణంబు పట్టి పటుబాహాశక్తితో దీసినన్
 దునిగెన్ జాతము భూరిఘోషమున వార్ధుల్ మ్రోయుచందంబునన్. 106

గీ. ధనువు దునిమినంత ధరణీశసూనులు శిరములెల్ల వంచి సిగ్గు పడిరి
 సీత మేను వంచె శ్రీరామచంద్రుని బొగడె నపుడు జనభూవిభుండు. 107

వ. ఇట్లు శ్రీరామచంద్రుని సత్యసంపదలకు మెచ్చిసంతోషించిజనకమహారాజువివా
 హంబు సేయువాడైపరమ్మన దశరథేశ్వరుని పేరిట శుభలేఖలు వ్రాయించిపంపిన

దశరథమహారాజును నాశుభలేఖలం జదివించి, సంతోషంబున నానందబాష్పంబులు గ్రిమ్ముకొనఁగ మంత్రిప్రవరుండగు సుమంత్రునిం బిలిపించి సుమంత్రా! యిపుడు మనసైన్యమును బయలుదేరి మిథిలాపట్టణంబునకుం బోయి యట జనకమహారాజుగారింట మన రామలక్ష్మణ భరతశత్రుఘ్నులకు వివాహమహోత్సవములు జరుపవలయును గావున వసిష్ఠాదిద్విజవర్యులను, కౌసల్యాది కాంతాజనమ్మును నరుంధతీ మొదలుగాఁ గలభూసురభార్యలను, మఱియు సకలబంధుజనంబును రావించి బంగరుటరదంబుల నిడికొని తోడ్కొని రమ్మని యంపిన నతండును మహాప్రసాదం బని తత్క్షణమ యంతఃపురంబునకుం బోయి కౌసల్య కైక సుమిత్ర మొదలగు రాజకాంతలను వసిష్ఠాది ద్విజవరిష్ఠులను నరుంధతి మొదలుగాఁ గల ముత్తైదువలను మిగిలిన సకలబంధుజనమ్ములను రావించి యుక్తప్రకారంబుగాఁ గనకరథమ్ములపై నిడికొని దశరథ మహారాజుకడకుం గొనివచ్చిన యంత దశరథుండు పుత్రద్వయసహితమ్ముగ రథ మారోహించి సమస్తసేనాసమన్వితుం డగుచు వాద్యఘోషంబులు దశదిశలు నిండ నడచుచున్న సమయమ్మున నంతకముందు జనకభూవల్లభుండు దశరథమహీపాలు నెదుర్కొని తోడితెచ్చి యనుగులు గడిగి యర్ఘ్యపాద్యాదివిధుల విధ్యుక్తంబుగాఁ బూజించి మానితంబుగఁ గానకలాసంగి సకలసంపత్సంపూర్ణ మయిననివేశముఁ గల్పించి యందుఁ బెండ్లివారిని విడియించె నంత నక్కడఁ గనకవికారమైన పీఠమ్ములపైఁ గూర్చున్న సమయంబున దేవా శుభముహూర్తం బాసన్న మగుచున్నది రమ్మని వసిష్ఠుండు సముచేర నాతఁడు చని రామలక్ష్మణ భరతశత్రుఘ్నులకు మంగళస్నానంబుఁ జేయించి నిర్మలాంబరాభరణంబు లొసంగి వేర్వేఱ నొక్కముహూర్తమ్మునఁ దనకూతు సీతను శ్రీరామచంద్రునకును దనతమ్ముఁడు కుశధ్వజుని కూఁతురగు మాండవ్యూర్మిళాశ్రుతకీర్తులను భరతలక్ష్మణశత్రుఘ్నులకును నిచ్చి వివాహముం జేసి తత్ప్రియతనయుల కొక్కొక్కరికి నూఱేసి భద్రగజమ్ములను నేసితురంగంబులను బదివేలు దాసిజనమ్ములను లక్షధేనువులను వరణంబులిచ్చి దశరథాదిరాజలోకమ్మునకు బహుమానమ్ముగా నవరత్న ఖచితభూషణమ్ములును జీని చీనాంబరమ్ములును నొసంగి సుగంధద్రవ్యమ్ముల నర్పించి పూజించి యంపె నంత దశరథమహారాజు మరలి యయోధ్యాపట్టణంబునకు వచ్చుచుండగా మధ్యమార్గంబున. 108

ఆ పరశురాముఁ డడ్డుపడి వచ్చి మీనామ మెవ్వరనిన మొలకనవ్వుతోడ
నేను దశరథుఁడ నీతఁడు నాపుత్రుండు రాముఁడండ్రు పేరు భీమబలుఁడు 109

దశరథుండు కుమారచతుష్టయమ్ముతో నయోధ్యానగరంబు బ్రవేశించి సుఖోన్నతి
రాజ్యంబు నేలుచున్న సమయంబున.

శా. పారావారగభీరికిన్ ద్యుతిలసత్పద్మారికిన్ సత్యవి
స్తారోదారవిహారికిన్ సుజనరక్షాదక్షగక్షారికిన్
సారాచారవిచారికిన్ మది రిపుక్ష్మాపాలసంహారికిన్
శౌరీసాటినృపాలకుల్ దశరథోన్నాథ జంభారికిన్

వ. అని కొనియాడ దగిన నృపాలశేఖరుండు ధర్మమార్గంబు నాక్రమింపయేని దప్ప
కుండ రాజ్యంబు సేయుచుండె ననుట విని నారదుని వాల్మీకిమహామునీశ్వరుండట
మీదికథావిధానం బెట్టిదని యడుగుటయు. 124

క. జలజాక్షు! భక్తవత్సల! జలజాసనవినుత పాదజలజాత! సుధా
జలరాశిభవ్యమందిర జలజాకరచారుహంస! జానకినాథా! 125

గద్యము. ఇది శ్రీగౌరీశ్వర వరప్రసాద లబ్ధగురులింగ జంగమార్చనవినోద
నిత్యశైవాచార సంపన్న సూరిజనవినుతాతుకూరి కేశంశెట్టి
తనయ మొల్లనామధేయ విరచితం బైన శ్రీరామాయణ
మహాకావ్యంబునందు బాలకాండము
సర్వము నేకాశ్వాసము.





# శ్రీరస్తు.

# మొల్లరామాయణము.



## అయోధ్యాకాండము





కందర్పరూప! ఖండిత
కందర్పవిరోధిచాప! కరుణాద్వీపా!
వందితశుభనామా! ముని
సందోహస్తుత్యధామ! జానకిరామా!

వ. శ్రీనారదమునీశ్వరుండు వాల్మీకిమహామునికిఁ గెఱింగించిన తెఱంగు వినిపించెద నాకర్ణింపుము

సీ. తనసుమంత్రాదిప్రధానులతోఁ గూడి, సుఖగోష్ఠి నుండంగ నఖిలజనులఁ
జక్కఁగా రావించి సమ్మదంబున వంశ, గురునితో దశరథధరణినాథుఁ
డనియె నీభూభారమంతయు నొక్కఁడ, నేలితిఁ జాలదే యేకహేళి
నటుగాక సంతత నవలీల గెల్చితి నిల్పితి ధర్మమ్ము నిష్ఠతోడ

గీ. నింతచాలదె యాశకు నెంతకెంత, రామచంద్రుని ధరణికి రాజుగాఁగ
మీరుచూడంగఁ బట్టంబు భూరిమహిమ, గట్టవలయును మంచిలగ్నమునఁ జెలఁగి 4

గీ. అనుచు గురునకుఁ జెప్పి తానతనిసమ్మ, తమున సౌభాగ్యమంగళద్రవ్యసమితి
గూర్చుఁడనుచును మంత్రులకును నెఱుంగఁ, జెప్పి శృంగార మీపురిఁ జేయుఁ డనియె

వ. అట్టిసమయంబున.

గీ. పగలు ప్రాగ్భాగమున నుండి గగనవీథిఁ, జరమదిక్కున కేఁగఁగా శ్రమముదోఁచి
చెమట పట్టిన స్నానంబుఁ జేయునరుని కరణి నపరాబ్ధిలో దివాకరుఁడు గ్రుంకె 6

క. మేలిమి సంధ్యారాగము, వ్రాలినచీకటియు గలిసి వరుణినివంకన్
నీలముఁ గెంపును నతికిన పోలికఁ జూపట్టెనట నభోమణితలఁపన్ 7

క. తారక కల్పద్రుమమునఁ, గోరకములు పుట్టినట్లు గురుతరకాంతిన్
దారకములు తల సూపెన్, జోరానీకమ్ము మిగుల స్రుక్కుచునుండన్ 8

గీ. కాముపెనుఁగులరీతిఁ గాటుకదండాన నీటిబాతి నింద్రనీలమహిమ
నూనరాశిపోల్కి మటిమటి యపుడంధ, కారమవనియెల్ల గలసి పర్వె. 9

వ. అట్టిసమయంబున. 10

చ. తిలకములన్ నిజాధిపులఁ దప్పకు సేర్పఁగఁ గన్ను బ్రామి యు
త్తల దమపిన్నపాపల నుదారత నేర్పడ నిద్రపుచ్చి ని
ర్మలకరకంకణావళులు రట్టుగ దాపటు మ్రోఁగనీకవి
చ్చలవిడిగాఁ జరించి రొగి జారలతాంగులు మధ్యరాత్రులన్. 11

చ. సురతము లేక యుస్సురను బోటి మగంటుడికించు కాంతియున్
సరస మెఱుంగు చంద్రికటుకి సావడిదంటయు జేగకత్తెయున్
బరపురుషాభిలాషమును బాయని భామిని పోటుకట్టునన్
బరగినభామలాది యుపభర్తలఁగూడి చరించి రత్తరిన్. 12

ఉ. భానుసహస్రసతి రణపంక్తుల నద్భుత మైనయా బృహ
ద్భానుని సెట్టి బెల్లుడకఁ బట్ట సుధాంబుధిమీఁది మీఁగడల్
ప్రాని కమీరుచేఁ గెరల పూర్వదిశం గనుపట్టు నాశిపై
ఫేన మనంగ నొప్పె శశిబింబము తూరుపుకొండమైఁ దగన్. 13

చ. కుముదములుం జకోరములుఁ గోమలసస్యముఁ జంద్రకాంతముల్
రమణఁ జెలంగ వెన్నెల తిరంబుగఁ జేసె జగంబు లుబ్బఁగాఁ
గమలములున్ వియోగులధికంబుగఁ జోరులుఁ జక్రవాకముల్
రమణఁగలంగ వెన్నెల తిరంబుగ గాచె జగంబులుబ్బఁగాన్. 14

ఉ. నారదు లైరి సన్మునులు నాకమహీజములయ్యె భూజముల్
శారద లైరి భామినులు శంకరశైలము లయ్యె గోత్రముల్
పారద మయ్యె నీరధులు పన్నగనాయకు లయ్యె నాగముల్
వారిదవర్గ మెల్ల సితవర్ణము లయ్యెను బండువెన్నెలన్. 15

చ. కొడుకుదయించెనం చలరి కోరి సుధాంబుధి మిన్నుముట్టి య
ప్పుడు జగమెల్లఁ గప్పెఁ దాఁ బూర్ణత నొందెను సాంద్రచంద్రికల్
పుడమికి బాలవెల్లిగతిఁ బొల్పెసలారఁగ జంద్రుఁ డొప్పెన
య్యుడుపతి మేనిమచ్చయును నొప్పెఁ బయోనిధిపద్మనాభుఁడై. 16

వ. అట్టిసమయంబున. 17

ఉ. కోరి చకోరదంపతులు గుంపులుగుంపులు గూడి గంతులన్
జేరిన చంద్రికారసముఁ జేర్కొని మార్కొని పొట్టనిండఁ గాఁ
బారణసేసి పెన్వయలఁ బ్రాకుచు జంచుపుటంబు లెత్తుచున్
జేరము వారుచుండె మదిఁ బ్రేమ జనింప వధూటికోటికిన్. 18

ఉ. వెన్నెలతీగలన్ గొనలు వేయక మున్కల ద్రుంచి తెచ్చి దా
నెక్కొన్న ప్రియాంగనాతతికి నూరిమి నోటికి నిచ్చి కేళికిన్
సన్నపుఁగంధశాళుల సన్నలు సేసి సుఖించె నింపుగన్
దిన్న చంద్రకాంతమణితిన్నెలమీదఁ జకోరదంపతుల్. 19

గీ. పాకశాసని చేతిబంతి దివికి నెగుర వైచినక్రైవడి నేమి సెప్పఁ
బాండువర్ణంబుతోఁ బూర్వభాగమందు, సొంపుమీఱంగ వేగురుఁజుక్క వొడిచె

వ. అట్టిసమయంబున. 20

క. రవి యుదయించెను జనఁడీఁ నక్షత్రసమితి తిమిరము శశియున్
బవలేమిటి కనురీతిని గువలయమున గూళ్ళ గోళ్ళ గూయ మొదలిడెన్. 22

చ. వదలక పద్మరాగమణి వట్రువఁ గ్రాలఁగ బట్టి నేర్పు మెం
పొదవఁగ దూర్పుకొండపయి గొప్పఁగఁ దెచ్చి జగద్గురుండు దాఁ
ద్రిదశవరేణ్యుకట్టెదుర దేటవ నిల్పినదర్పణంబు నా
నుదయము నొందె భానుడు సముజ్జ్వలలోకనదప్రదీప్తులన్. 23

వ. ఆరాత్రి రాజశేఖరుని చిత్తంబు వచ్చునట్లుగా మెలఁగి యాతఁడు దన్ను మెచ్చ
నెఱింగి కైక యిట్లనియె. 24

గీ. రఘుపతీశ నాకు వరమిచ్చి తప్పుట తగవు గాదు మీకుఁ దలఁపులోన
మఱచినార వేమొ మన్నించి తొల్లింటి యీవు లీయవలయు నీక్షణంబ. 25

క. రవినాథ నాకుమారుని వినుఁడీ పట్టంబు గట్టి వేవేగను రా
ముని మునిగా ననుపుము మఱిఁ వనమున బదునాలుగేండ్లు వర్తింపంగన్. 26

వ. అని ప్రార్థించిన విని చక్రవర్తి పిడుగుపడిన తల్లడిల్లుచు నుల్లంబున గలంగియు
సుంగిడి యచ్చేడియ పలికినపలుకులకు మారాడక నోడి మిన్నక యున్నసమయం
బున సుమంత్రుండేతెంచి స్వామీ రామచంద్రునిఁ బట్టంబు గట్టను మహూర్తం
బాసన్నంబయ్యెఁ గావున మిమ్ము నచటికి విచ్చేయ నవధరింపు డని వసిష్ఠభగవా
నుడు విన్నవించు మని పంపెనని చెప్పిన విని కైక యిట్లనియె. 27

మ. అవనిలో మెచ్చ నృపాలుచిత్తమున కేవాహ్లాదముంగూర్చి నా
తనయున్ బట్టముకట్టి రాఘవుని బద్నాల్గేండ్లు కాంతారమం
దునవర్తిల్లఁగ బంపగొన్న వరమున్ ద్రోయంగ రాదెంతయున్
స్వయసీనున్ మునివృత్తినుండుమనుఁడీ వైళంబ యారామునిన్. 28

క. అని పలుకు కైకపలుకులు విని వేగమ మరలివచ్చి విన్నదనంబున్
దనుక వసిష్ఠునితోడన్ వినుపించె సుమంత్రు డట్టినిధ మేర్పడగన్. 29

వ. ఆ        వశిష్ఠాదిప్రముఖులును సుమంత్రాదిప్రధానజనంబులును సైన్యంబును
పరివారంబులును విన్ననై యున్న వాసన్న యెఱిఁగి రామచంద్రుండు రాజచిహ్నం
బుల త్యజించి జటాంభూతిపుండ్రంబులు దాల్చి ధనుర్ధరుండై యున్న లక్ష్మణుం
డును భూపుత్రికయును దోడ జనుదేర దల్లులకు నమస్కరించి వసిష్ఠానుమతం
బున నాశీర్వచనంబులు గైకొని యాస్థానంబును వెలువడి యరణ్యంబున కరుగు
నప్పుడు పురజనులందరును బహుప్రకారంబులం బొక్కుచు దశరథమహారాజును దూషింపు
చుఁ గైకను నిందింపుచు మూకలై శోకింపుచుండ నది యంతయు విని దశరథుండు
పురోహితామాత్యబంధువర్గంబులతో శ్రీరామచంద్రుం డేగినత్రోవం జన్నంత నా
రాముఁడు దూరంబునకుఁ జనియె దశరథుండును మరలి వచ్చి పుత్రశోకంబున
వారి పురంబునకుం జనియె దదనంతరంబ. 30

గీ. చనుచు రాఘవుండు స్వర్ణదియొడ్డున గుహుఁ గాంచి యతని గుస్తరించి
తడయ కోడ బెట్టి దాటింపు మనవుఁ డట్లు సేయ దలచి యాత్మలోన. 31

చ. సుడి గొని రాముపాదములు సోఁకి ధూళివహించి రాయియే
ర్పడ నొక కాంతి యయ్యె నటు పన్న సీతనిపాద రేణు వి
య్యెడ వడి మోడ సోక నిదియేమగునో యని సంశయాత్ముఁడై
కడగె గుహుండు రాముపదకంజయుగంబు భయమ్ము పెంపునన్ 32

వ. ఇట్లు శ్రీరామచంద్రుని శ్రీపాదంబుల నటు గడిగి యోడపై నెక్కించి యమ్మ
వ్వర నవ్వలికి దాటించిన నాతఁడంబ. 33

ఉ. రాజకులావతంసు డగు రాముడు తమ్ముడు దాను నాభర
ద్వాజమహామునీంద్రపదవారిజముల్ గని మ్రొక్క నాతఁడ
బ్జోజసితాన్వయాబ్ధిపరిపూర్ణసుధాకరుఁ డైనరామునిం
బూజలొనర్చి కందఫలమూలములన్ బరితృప్తి జేసెనన్. 34

వ. సంతసింపుచు నారాత్రి యచ్చటనివసించినయపుడటిదినమునమరొక్కదయమున 35

ఆ. ముదముతోడ దమ్ము ముని భరద్వాజుండు, భక్తి నతుప రాముభద్రు డపుడు
చనియె భ్రాతృదారసహితుడై రమ్యకూటమునకు జిత్రకూటమునకు. 36

మ. ఘనుఁడా రాముడు చిత్రకూటమున వేడ్కం జేరి యున్నంతలో
నన దంతావళవాజిరత్న రథనానాయోధసంఘంబుతో
డ సమాత్యద్విజబంధువర్గములతోడం గూడి వాద్యంబులన్
జనుదెంచెన్ భరతుండు రాముకడకున్ సద్భక్తి యొరగన్. 37

సీ. చనుదెంచి రాముని చరణంబులకు మ్రొక్కి, కైకేయి చేసినకపటమునకు
నగరంబు విడిచి యీపగిది ఘోరారణ్య, మునకిట్లు రానేర మునులపగిది
నది గాక మనతండ్రి యత్యంత మైనట్టి పుత్రశోకంబునఁ బొక్కి పొక్కి
త్రిదశాలయమ్మున దేవేంద్రుఁ గనఁ బోయెనని చెప్పవిని రాముఁ డంతలోన

గీ. భరత లక్ష్మణ శత్రుఘ్న ధరణిసుతులఁ గూడి దుఃఖించి దుఃఖించి కొంతవడికి
నాప్తవర్గంబుచే మానె నంతమీఁద భరతుఁ డిట్లనె శ్రీరామభద్రుతోడ. 38

గీ. రాజులేకున్నచో మఱి రాష్ట్రమందుఁ గార్యమెట్లగు మీరెఱుంగనిది గలదె
నేఁటిసమయాన బట్టంబు నిలుపుకొనఁగ, దిరిగి విచ్చేయుఁడనుడు నాభరతుతోడ

వ. శ్రీరామచంద్రుం డిట్లనియె.

చ. జనకుఁడు చేసినట్టిమితి జక్కఁగదీర్చి కడంక నేను వ
చ్చినగతి గాక భూతలముఁ జేకొని రాజ్యముఁ జేయుమాట గా
దనుచు మతున్న వ్రాల్లవన నాతనికిం దనపాదుకాయుగం
బొనరఁగ నిచ్చి పొమ్మనుచు నుర్వికి రాజుగ బంపె సొంపుగన్.

వ. ఇట్లు భరతు నిభంగతాఖండనునయించి మరలించి నాకలోకకవాటం బగు చిత్రకూటంబు కడచి సౌమిత్రి సూపుత్రులం గూడి పోవునెడ నటవీమధ్యంబున విరాధుండను దైత్యాధముం డపరాధంబు చేసి దిగ్గన దగ్గఱి జగతీతనూభవ నెత్తుకొని గగనమార్గంబున కెగిరిపోవునెడ వాఁడిబాణంబున వాని కంఠంబును ద్రుంచి గారుడాస్త్రంబున మరల నాయ్యన జనకనందనం డింద భయంబు వాపి ప్రియంబు చూపి యయ్యరణ్యాననయ్యెడ నున్న యత్రిమహాముని యాశ్రమంబునకు జని ఘనంబుగ నాఘనుండు సేయు పూజలం గైకొని రామచంద్రుం డచ్చటిమునీంద్రులను దైత్యులవలని భయంబు లేకుండ నభయం బిచ్చి మన్ననం గొన్నిదినంబు లాయా మునులయాశ్రమంబుల నిలుచుచు వారలనుప శరభాదిదివ్యగోత్కరశరణ్య బంధు నరణ్యంబు జొచ్చిపోయె నని చెప్పిన విని నారదుని వాల్మీకిమునీంద్రుం డటుమీఁది కథావిధానం బెట్టిదని యడుగుటయు.

క. జలజాక్ష భక్తవత్సల, జలజాసనవినుతపాదజలజాతసుధా
జలరాశిభవ్యమందిర జలజాకరచారుహంస జానకినాథా.

గద్యము. ఇది శ్రీగౌరీశ్వర వరప్రసాద లబ్ధగురులింగ జంగమార్చనవినోద
నిత్యశైవాచార సంపన్న సూరిజనవినుతాతుకూరి కేశనశెట్టి
తనయ మొల్లనామధేయ విరచితం బైన శ్రీరామాయణ
మహాకావ్యంబునందు అయోధ్యాకాండము
సర్వము నేకాశ్వాసము.



శ్రీరస్తు.

# మొల్ల రామాయణము.



## అరణ్యకాండము





నినతత్త్వధనుర్ధా
మునినాథప్రియసతీ సుపూజితపాదా
జనకార్చితగుణనామా
సనకాది స్తవ్యనామ జానకిరామా.

వ. శ్రీనారదమునీశ్వరుడు వాల్మీకికి కీర్తించిన తెఱంగు వినిపించెద. 3

చ. ఇతఁడికి బాదచారితన మేటికి వచ్చెనో పట్టభద్రుఁడీ
సతి నవరూపరేఖలను జక్కనిదయ్యును నిట్టిదుర్గతిన్
ప్రతివసియించు టెట్లొ రతిరాజసమానుల వీరి నేల యీ
గతిఁ బడద్రోచె బ్రహ్మయని కాంతురు చెంచెతలమ్మహాత్ములన్.

సీ. నడువ నేరని కొమ్మ యడుగులు బొబ్బలై శర్కరాస్థలములు శ్రమము జెందె
వీచిన చేతుల వ్రేళ్ళు నెత్తురుగమ్మి పాటలవర్ణకెంపుల పోల్కి నమరె
వడిగాలి సుడివడి వాడినతీగ భావంబులను మేని చేవ తఱిగె
పూర్ణచంద్రుని కాంతి పున్నమ వేకువ గనుపట్టుగతి మోము కళలు విడిచె

గీ. భర్తను నడుగడుగునకు నైదండగొనుచు నెఱసుదప్పిన నిట్టూర్పులెసఁగ చిగురు
టెదవు లెండఁగ నీడకు మదిలగొనుచు మనసులో జేయయాతఁ జనెడు వేళ. 4

వ. ఇటులా సీతయు రాముండును సత్యబుషింబోని సౌమిత్రియుఁ గతిపయప్రయాణంబు
లఁ బంచవటికిం జని సంతోషభరితాంతరంగులై.

క. అచ్చటఁ గొన్ని దినంబులు నచ్చటపడియుండ దలచి మునిముఖ్యులచే
మచ్చిక దమ్ముఁడు దానును గ్రచ్చఱ నాకపర్ణశాల గావించిరిగన్. 6

గీ. అందు రామచంద్రుఁ డనుజన్ముఁడును దాను గొన్ని వాసరంబులున్న వేళ
వికృతవేషధారి వేవేగ నటు శూర్పణాక యనెడి దైత్యనారి యొకర్తు 7

వ. రామునిం గని ప్రేమాభిరాముం బగుమనంబున నన్ను గావించి రమ్మనిన రామ
చంద్రుడు సౌమిత్రిం జూపన తడు మున్న మాయన్న నభిలషించుటం జేసి

నాకు దోసంబు గాన నీ వా రాముని కడకు మరల జను మన్న నది యట్లు చేసిన రామచంద్రుండు దిరుగ లక్ష్మణుం జూపిన గోపించి యా రాక్షసి మనుజేంద్రు చూపుల దండిం బదలించిన నెఱింగి భరతానుజుండు దాని నాసికాకర్ణంబులు గోసివైచిన నది నెత్తురు జొత్తిల్లఁ బలిపాపయుం బోలె యేడ్చుచు ఖరదూషణాదు సోదరులకుం జెప్పిన వారు గనలి క్షణంబున.

క. పదునాల్గువేల దైత్యులు మదమున సోదరులు గొల్వ మండుచు శూరా
స్పద ఘనరథనికరముతో గదనంబున రాముకడకు ఖరుఁడేతెంచెన్

గీ. ఇరుగు వచ్చినట్టి కలకలం బాలించి రాఘవుండు తనదు రమణి యొద్దఁ
దొలఁగకుండ ననుజుఁ దోడుగాఁ గాపుంచి బెదర కంతఁ గలని కెదిరి నిలిచె. 10

శా. ఆవేళన్ ఖరుఁ డుగ్రవృత్తిలయకాలాభీలఘోరాకృతుల్
పైపైరాన్ గజవాజిసంఘముతో దైత్యాళితో ఘోరరో
షావిర్భూతమనస్కుఁడై నడిచె గర్వారంభసంరంభుఁడై దే
వానీకము భీతిఁబొంది కలఁకన్ దేజంబు పొంపారఁగన్. 11

వ. ఇట్లు ఖరుఁడు పనుదెంచి భయంకరంబుగా రణంబు సేయు సమయంబున 12

ఉ. అప్పుడు రామచంద్రుఁడు భయంకరరౌద్రరసంబు కన్నులన్
నిప్పులు రాల్చుచున్ మెఱయ నిగ్గులు లాగ విచిత్రశస్త్రముల్
తుప్పలు గాఁగ సేయుచును గుంజరవాజిరథావళుల్ ధరన్
దప్పక కూల్చుచున్ రుధిరధారల దేల్చె సురారిసంఘమున్. 13

వ. అట్టి సమయంబున.

క. కరితురగస్యందనములుఁ బరివారము దెగినపిదపఁ బటురోషమునన్
గరకరబడుచును నెదిరిన ఖరకరవంశజుఁడు ద్రుంచె ఖరుశిరంబున్. 15

వ. త్రుంచినం గని తీవ్రంబుగా 16

క. ఘోషించి రామచంద్రుని దూషింపుచు వచ్చినట్టి దూషణుమీదన్
రోషించి సురలు కడుసంతోషింపఁగ వానిశిరము ద్రుంచె గడంకన్. 17

గీ. త్రిశిరుఁ డంత గనలి దివ్యాస్త్రసంపద రాముమీఁద జూపి రణమొనర్ప
మూఁడుశిరము లతఁడు మొదలిచి యటు వాని మూఁడుతల ద్రుంచె మొగ్గరమున 18

వ. ఇటు ఖరాదిరాక్షసుల శిక్షించి జయంబు గొని ధను వెక్కుడించి మరలి పర్ణశాల
కేతెంచి తమ్ముఁడును దానును సమ్మదంబునం గలిసి యున్న సమయంబున 19

చ. చలమున నంత శూర్పణఖ సయ్యన లంకకు నేగి రావణుం
గొలువునఁ గాంచి మ్రొక్కి తనకున్ నృపసూనులు సేసినట్టిచే

తలు వి?పించి వారుతమతండ్రి యనుజ్ఞను వచ్చి కానలో
పల దిరుగాడుచుందమున బన్నుగ నేర్పడ జెప్పి పిమ్మట౯ 20

క. ఆ రాముభార్యవిభ్రమ మేరాజతనూజలందు నెఱుగమువిని ముక్
దారుణిలోపల గామినులా మణికి సాటి బోల గల్గిమతి జేయ౯. 21

సీ. కన్నులు గలువలో కాముబాణంబులో తెలివిగా నింతికి దెలియరాదు
పలుకులు కిన్నెరపలుకులో చిలుకల పలుకులో నాతి కేర్పఱుపరాదు
అమృతాంశుబింబమో యద్దమో నెమ్మోము తెంపుతో సకి భావింపరాదు
కుచములు బంగారు కుండలో చక్రవాకములో చెలి కెఱుంగరాదు

గీ. కురులు నీలంబులో తేఁటిగుంపు లొక్కొ పిఱుదు పులిన బొమ్మన్మధు పెండ్లియరుగొ
యనుచు గొందరుసంశయంబందుచుండ వెలది యొప్పారులావణ్యవిభ్రమముల

క. కలదో లేదో యనుచును బలుమరు నెన్నడుమును జూచి పలుకుదు రితరుల్
బలిమో కలిమో యనుచును బలుమరు జఘనంబు జూచి పలుకుదు రితరుల్ 23

సీ. పత్పదంబుల పైకి సంపెంగ పువ్వుల, జలజాతముల పైకి జందమామ
గిసలయంబుల పైకి వెసగలకంఠముల్ సింధురమ్ముల పైకి సింహములను
దోషచరంబుల పైకి దొడ్డ రాచిలుకల నలరు దూపుల పైకి హంసవితతి
బండు వెన్నెలనిగ్గు పైకి జకోరముల్ పవనంబుబూదికి బాప తేని

గీ. మరుడు వైరంబుచేసినమాడ్కి నలకకల నాసి కాక రాననచరణస్వనములు
వరపయోధరమధ్యోష్ఠ వచనబాహు గమనహాసాక్షు లూర్వారు రమణికమరె 24

క. బంగారునీరు నిలువున బొంగారుచు నుండ నజుడు వోసినమాడ్కి౯.
శృంగార మెల్ల నిలువున బొంగారుచు నుండు గరగి పోసినమాడ్కి౯

వ. అట్టివయోరూపంబులను గనుపట్టునట్టి యక్కాంతారత్నంబు నీకుసిద్ధించె నేని నీవు
త్రిభువనంబులు నిజయంబుచేసిన యంతకన్నను సంతసింతువన్నవిని కామాంకురంబు
లంకురిలి కామాంధుండై కన్నులు గానక యన్నుకొనితిన్న దామాఱిచియొద్దకోల
గంబు సాలించి పుష్పకంబను విమానరత్నంబు పైనధిష్ఠించిమారీచుకడకుంజనిప్రా
ర్థించి నీవు కనకమృగంబవై జనస్థానంబునకు జని దశరథనందనుండగుశ్రీరాముండు
న్నపర్ణశాలకడకుం బోడకట్టిన నతండునుని న్నువెనుకొనుసీతనతనికతిదూరంబుగా
గొనిపోయి మాయంబైన నేనును రాముని భార్యం గొనివత్తునని నవినిసమ్మతిలకమా
రుత్తరం బిచ్చినరామబాణుండుగ్రంక్షై మందిపడ నతండాసన్న యౌతింగికనకమృ
గరూపంబును దాల్చి నాశ్రమంబున. 25

వ. చెప్పినమాటలు విని విన్నదనంబున జిన్నబోవుచు దుర్నిమిత్తంబులంగనుచుఁ
దత్తరంబున నాశ్రమంబునకు జని యక్కడ.

గీ. పర్ణశాలలోనఁబరికించి పరికించి సీత గానబడమి జిన్నవోయి
చిత్తమంత గలగి శ్రీరామచంద్రుండు పలువరింప జొచ్చెబ్రమసిబ్రమసి. 51

సీ. నీదృగ్విలాసంబు నెఱినభ్యసించెను గుఱుకుచ గానవే హరిణవిభుడ!
నీమంజులాలాపచయంబు గైకొన్న శుకనారి గానవే పికకులేంద్ర!
నీయిందుసత్కాంతి నెమ్మోము గలయట్టి, రుచిరాంగి గానవే రోహిణీశ!
నీపక్షవిన్యాస్త మెనయు ధమ్మిల్లంబు గలయింతి గానవే యళికులేశ!

గీ. స్తనభరంబున నీపోల్కి దనరినట్టి యతివ గానవే చక్రవాకాధినాథ!
చెలియ నినుబోలు నెన్నడ నేర్చినట్టి రమణి గానవె నీవు మరాళరాజ! 52

సీ. ఘనసార రాజంబ! కానవే నీకంటె, గంధంబు గలయట్టి కరటియాన
గదళీకాతరురాజ! కానవే నీయట్టి మెరుగుబెందొడల మామీన నేత్రి
విలసిల్లు చంపకవ్రతంబ! కానవే లలి నీదుపుష్పవిలాసనాసఁ
గమనీయలత! నీవు కానవే నీయట్టి కరములు శోభిల్లు కంబుకంఠ

గీ. క్రముకఫలనిరుహాధీశ! కానవయ్య నీఫలస్ఫూర్తికంఠంబు నెలవేణిఁ
గళికలను మించు నవకుంద! కానవమ్మ నీదుకోరకనిభదంత నీరజాస్య. 53

సీ. వనజాస్య! నినుగూడి వర్తించు నతిఘోర వనములు శృంగార వనములగును
పడతి! నీతోగూడి పవళించు కర్కశ, శయ్యలు పూవులశయ్యలగును
గలకంఠి! నీచేతి కందమూలాది భోజనములు మధురభోజనము లగును
హరిమధ్య! నినుగూడి చరియించు నటువంటి, తపములు సత్పుణ్యతపము లగును

గీ. గరలి నీతోడగూడి భోగించునట్టి భోగమంతయు దేవేంద్రభోగ మగును
సుదతి! పొడగట్టుగదె! నాకు మాడవలయు గన్నులకు గానబడవేమి కమలనయన.

వ. అని మఱియును

సీ. ఏమృగంబును గన్న నేణాక్షి గానవే యను వెక్కిభంగుల నడిగి యడిగి
యేపక్షి గనుగొన్న నెలనాగ గానవే యని వెక్కిభంగుల నడిగి యడిగి
యేమ్రాను బొడగన్న వామాక్షి గానవే, యని వెక్కిభంగుల నడిగి యడిగి
యేగట్టుఁ బొడగన్న నిభయాన గానవే యని వెక్కిభంగుల నడిగి యడిగి

ఆ. కలగు భీతినొందు దలకు జిత్తములోన, సొలయు మూర్ఛ బొవు గలయు నలగు
సీత గానబడమి శ్రీరామచంద్రుండు, విరహతాపవహ్ని వేగి వేగి 56

వ. ఇట్లు సీతావియోగంబునకు బలవరింపుచున్న యన్నం గని సౌమిత్రి యిట్లనియె. 57

క. దీనునిక్రైకడి నూరక మానక పెడబొబ్బ లేల మనుజేశ్వర! యీ
కాననరూపములు వెదకక గానఁబిమ్మట వగవం గాదు మనకున్. 58
వ. అని పరితాపించి శోక మూపుకొనఁజాలక కన్నులు జేవురింప సన్నుతో ట్లనియె. 59
ఉ. వ్రచ్చెద నాకలోకమునవారలకుండెలు నాగలోకముం
గ్రొచ్చి యహీంద్రవర్గమును గూల్చెద గర్వపుఁగొండ కెవడిం
దచ్చెద మర్త్యలోకమును దారత నేగతినైన నిమ్మహిం
దెచ్చెద సీత నీక్షణమ దేవర చిత్తము మెచ్చునట్లుగన్ 60
వ. అని యిట్లు పలికి మరియును 61
ఉ. చించెద దైత్యసంఘముల జెండెద వండెద కేసి బ్రహ్మబా
ధించెద లోకపాలకుల ద్రెళ్ళఁగ నేసెద భూతలమ్ము గ్ర
క్కించెద శైలజాలముల గిటడగించెద భూమినందనన్
గాంచెద దల్లడిల్లకుము కంజహితాన్వయ వార్ధి చంద్రమా. 62
క. భూతలమున నాకసమున బాతాళంబున వెదకియు బాధించియు నే
సీతను దెచ్చినపిమ్మట నీతమ్ముడ ననుచు మెచ్చ నిఖిలోర్వీశా. 63
వ. అని పలుకుచున్న తమ్ముని శౌర్యధైర్యాదిగుణంబులకు సంతోషింపుచు జనస్థానంబు
వెడలి జనకనందన నన్వేషింపుచు దక్షిణాభిముఖులై చనుచు ముందట. 64
క. పక్షములు గాల్పు దుగ్గిన పక్షీంద్రుని జూచి రామభద్రుడు మదిలో
రాక్షసమాయ యనుచును శిక్షింప దలచు నంత శీఘ్రమె పలికెన్ 65
క. నీతండ్రికి నతిమిత్రుడ నో తండ్రీ! నన్ను నేయ మదితమె నీకున్
నాదగు పేరు జటాయువు, సీతాధిప! నన్ను నెరుంగు చిత్తములోనన్ 66
వ. అని చెప్పి వెండియు నాజటాయువు నిట్లనియె. 67
మ. వినుమో రాఘవ పంక్తికంధరుడు దోర్వీర్యంబు సంధిల్లగా
జనకక్ష్మాపతినందనన్ గొనుచు స్వేచ్ఛాప్రవృత్తితో నేగుచో
వనితారత్నము దీనయై పలుకు తద్వాక్యంబు లేర్పాటుగా
విని పోరాడగ బ్రాప్తమయ్యె మతియీవేళంబు భూమీశ్వరా.
క. అని సీత తెఱగు దనపని జననాయకుడైన రామచంద్రుని తోడన్
వినుపించి యాజటాయువు తను వెరియగ నంత గాలధర్మము నొందెన్ 69
వ. ఇట్లు రామచంద్రునకు సకలవృత్తాంతము నెఱింగించి శరీరంబు విడిచిన యాపక్షి
రాజునకు భక్తిపూర్వకంబుగా నగ్నిసంస్కారాదివిధులు తీర్చి దక్షిణాభిముఖులై
చనుచుం జిత్రరూపంబునున్న కబంధుని వధియించి ముందట. 70



శ్రీరస్తు.

# మొల్లరామాయణము.



## కిష్కింధాకాండము



క్షీంద్రవాహా! గిరిజా
ధ్యక్షమనోజ్ఞాతగేహ! యపహృతమోహా!
రాక్షసభీమా! మునిజన
సాక్షాత్కృతనైజధామ! జానకిరామా! 1

వ. శ్రీనారదమునీశ్వరుండు వాల్మీకిమహామునీశ్వరున కెఱింగించిన తెఱం గెఱింగించెద
నాకర్ణింపుము.

సీ. పంపాతటమ్మున బాణాసనాయుధపాణులై యున్న భూపాలసుతులఁ
గనుగొని భీతిల్లి కమలాప్తసూనుండు వాలిపంపున వీరు వచ్చిరనుచుఁ
గలఁగి తా నఋశ్యమూకంబున నుండక, వెఱచి మలయశైలవిపినసీమఁ
దిరిగి వారల రాక తెఱఁ గెల్లఁ దెలిసి రాఁ బవనాత్మజుని వేగఁ బంప నతఁడు

గీ. వచ్చి రఘురాముశ్రీపాదవారిజముల కర్థి బ్రణమిల్లి మీ రెవ్వ రయ్య యిటకు
నేమికతమున వచ్చితి రేది నామ మనుచు నడిగిన సౌమిత్రి యతని కనియె

సీ. దశరథుం డనురాజు తనయుల మాతని పంపునఁ దప మాచరింప గోరి
వచ్చి కాననభూమి వర్తించుచుండ నీ రాజుదేవిని దుష్టరావణుండు
కుటిలవృత్తిని నెత్తుకొని పోవ నాజాడ వదలక దిక్కులు వెదకి వచ్చి
శబరికి మా రాకచందంబు దెలియఁగ జెప్పిన నర్కజుచేత గాని

గీ. మీదు కార్యంబు నెగడదు మీర లరిగి వేగ సుగ్రీవు చెలిమి గావింపు డనిన
వచ్చినారము గనుగొనవలసి యతని నతఁడు రాముండు లక్ష్మణుం డండ్రు నన్ను

గీ. తలఁప నీరాజునకు నెందు ధాత్రిలోన విను మసాధ్యంబు లైనట్టి పనులు లేవు
సూర్యవంశోత్తముఁడు మహాశూరుఁ డితఁడు నీకుఁ బేరేమి చెప్పుమా మాకునైన

తే. నా కనుదేవుని బ్రార్థించి వేయిగతుల నంజనాదేవి గాంచిన యాత్మజుండ
నర్కజుని మంత్రినై యుందు ననుదినంబు వినుము నా పేరు హనుమంతుఁ డనుదు రిలను

వ. అని చెప్పి మఱియు నిట్లని విన్నవించె.

ఉ. తాలిమి దూలిపోయి పరితాపభవం బిరుగాడు కొక్కుచోఁ
గాలును నిల్వదొక్క నధికారము చాలకరొప్పుచు గడుం
జాలివహించు చిత్తమున జంచలతల్ సుభూపుత్రిపై
మేలిమి జేసి రాముఁడట మిన్నక దేఱుగొన్నకైవడిన్. 15

వ. ఇట్లు విరహతాపంబునఁ బొరలుచున్న సమయంబున గార్తికమాసంబు చనుదెంచిన శ్రీరామచంద్రుని బలంబులంగూర్చుకొనిరమ్మని సుగ్రీవుపాలికి సౌమిత్రి ననుప నా రాముతమ్మునిఁ గూడి యినజుండు తారాసమేతుండై చనుదెంచి రాఘవేశ్వరుల చరణారవిందమ్ములకు నమస్కరించి తనబలంబులఁ దోడుసూపఁ దొడంగ నెట్లనినఁ బదులును నూరులును వేలును బదివేలును లక్షలును బదిలక్షలును గోట్లును శతకోట్లును నర్బుదంబులును న్యర్బుదంబులును ఖర్వంబులును మహాఖర్వంబులును బద్మంబులును మహాబద్మంబులును క్షోణులును మహాక్షోణులును శంఖంబులును మహాశంఖంబులును క్షితులును మహాక్షితులును క్షోభంబులును మహాక్షోభంబులును నిధులును మహానిధులును సాగరంబులు మహాసాగరంబులును బరిమితంబులును మహాపరిమితంబులును ననంతగంబులును మహానవంతరంబులును గడచి లెక్కకుమిక్కిలి యొక్కువై డెబ్బదిరెండు వెల్లువలుగల కపిబలంబుతోడఁ దోడుసూపినం జూచి రాఘవేశ్వరుండు సంతోషించి సవిత్రునందను గారవించి కౌఁగిలించుకొని సీతాన్వేషణంబు జేయగలవానరోత్తములనధికబలయుతుల నేర్పఱచి దిశలకుం బంపు మనవుడుం దూర్పునకు మైందుండను బశ్చిమంబునకు సుషేణుండను నుత్తరంబునకు శతబలియు ననువారల నేర్పఱచి వారలకుదోడుగా వానరవీరులను లక్షలక్షసంఖ్యకుల నేర్పఱించి యిచ్చి జానకియున్నచోట్ల దెలిపి యొక్కనెలలో రమ్మని యనిపి హనుమంతునిం బిలిచి దక్షిణమ్మునకుం బొమ్మని యనుపునప్పుడు శ్రీరామభూపాలుండు వాని విద్యాపాదిగుణమ్ములకు మెచ్చినవాఁడై దగ్గఱఁగాఁ బిలిచి నీవు శౌర్యవంతుఁడవు హితుండవును గావున నీచేత మత్ప్రయోజనం బీడేయనని పలికి తనచేతి యంగుళీయకం బతనిచే కిచ్చితి యీ ముద్రిక జనకరాజనందనకు సమర్పించి యా జానకి శిరోరత్నంబు మా కానవాలుగా దెమ్మని యనుప నతం డియ్యకొని మొక్కిన వాతకిం దోడుగా నంగదజాంబవదాదులం గూర్చి యనిచె ననుటయు విని నారదుని వాల్మీకిమహామునీశ్వరుండట మీఁదికథావిధానం బెట్టిదని యడుగుటయును.

క. జలజాక్ష! భక్తవత్సల! జలజాసనవినుతపాదజలజాత! సుధా!
జలరాశి భవ్యమందిర! జలజాకరచారుహాస! జానకినాథా!

గద్యము. ఇది శ్రీగౌరీశ్వర వరప్రసాద లబ్ధగురులింగ మార్చనవినోద
నిత్యశైవాచార సంపన్న సూరిజనవినుతాతుకూరి కేశవశెట్టి
తనయ మొల్లనామధేయ విరచితం బైన శ్రీరామాయణ
మహాకావ్యంబునందు కిష్కింధాకాండము
సర్వము నేకాశ్వాసము





శ్రీరస్తు.

# మొల్లరామాయణము.



## సుందరకాండము





సూర్యకులరత్నదీపా!
సూర్యసహస్రప్రతాప! సుందరరూపా!
ఆర్యానందిత నామా!
శౌర్యాదికసుగుణసీమ! జానకిరామా!

వ. శ్రీశారదమహాముని వాల్మీకి కరుణించిన తెలుఁగు విన్నవించెద, నవధరింపుము. 2

గీ. రామునను మతి యక్కపిరాజు కరుణం దక్షిణంబున వెడలి దక్షిణంబు
వెదకువారగు వానరవీరవరులు, పంతములతోడ నెంతయుఁ సంతసమున. 3

క. మును తా మేగిన దిక్కులు పనివడి వెదకంగ జనిన బలిముఖులెల్లన్
జనకజ గానక వచ్చిరి మనుజేశునికడకు జనినమార్గంబుననే.

వ. అట్టి సమయంబున.

క. గిరులును నదులును వనములు బరికింపుచు బట్టణములు బహువిధగతులన్
దిరుగుచు వెదకుచు గానక కరువలికొడు కాది యైనకపివరు లెదుటన్. 6

క. ఆలోకించిరి సత్కాపి జాలము గరికరభ సింహశార్దూలమృగా
ఖిలము బుణ్యకదంబవి, శాలము నగునమ్మహేంద్రశైలము లీలన్. 7

వ. ఇట్లు నమ్మహేంద్రపర్వతంబు గనుంగొని డాయంజని యచ్చట.

ఉ. ఆతఱి వానరప్రవరు లాధరణీసుత గానలేక దుః
ఖాతుర త్రైవగం బతని నయ్యెడ దద్గిరినుండి వచ్చి సం
పాతి యనంగ బ్రసిద్ధుఁడగు పక్షికులేంద్రుఁడు గానుఁబోదు జా
నకి ను గొంచు బోవుగతి జెప్పను దెప్పిమలంకతోరివసమున్. 9

క. ఆపక్షీంద్రునిచేతను బాపలకుభనేత్రి రామచంద్రునిదేవిన్
పాపాత్ముఁడైన దైత్యుఁడు కేపట్టుక చనినతెరువ విని కపులెల్లన్. 10

వ. మహానందంబు నొంది యమ్మహేంద్రపర్వతం బారోహించి పూర్వభాగంబున. 11

క. ఆ కపివీరులు గనుఁగొని రాకాశనదీప్రముంబి తారాగ్భుతభంగా
నీకమహాఘునరవభయ దాకారవద్రుష్ప్రి కౌశల నాఁజలధీశున్. 12

వ. ఇట్లు కనుంగొని. 13

క. తమ తమ సత్త్వస్థితులను సమయించెదు నబ్ధికొలది గనుగొని మదిలో
బ్రియయుచు బలికెను గపిబంధుము లెంతయు డెందమందు గళవళపడుచున్ 14

క. ఈవార్ధి దాటు సత్త్వము, మావలనం జాల దింక మారుత! వినుమా
పావని పగుటం జేసియు నీవలనం దక్క నొరులు సేరరు దాటన్. 15

వ. అని యిట్లు ప్రార్థించిన తోడనే యుబ్బి వారివచనంబులకు సమ్మతించి వాయు
తనూజుం డిట్లనియె. 16

ఉ. పావనమూర్తి రామ నరపాలకు పంపున నబ్ధి దాటెదన్.
దేవవిరోధి దొంగిలిన జీవిని జూచెద గానకుండినన్
లావున గడ్డతోఁ బెఱికి లంకయు తెచ్చెద నట్లు కానిచో
రావణుఁబట్టి తెచ్చెదను రాముని సన్నిధి కెన్నికకులన్ 17

వ. అని వానరసంబులు సంతసిల్లునట్లుగా బిరుదులు పకాశించి తనకు దండ్రియైన
వాయుదేవునకును దిగ్మూర్త్యాత్మకుండైన లోకబాంధవునకును నింద్రునకును సంద్రి
మ్మునకును నమస్కరించి శ్రీరామలక్ష్మణులఁ దనమనఃపద్మంబునం దిడుకొని మొ
క్క బంధుమిత్రులం గాగిలించుకొని వారిచేత దీవనలం బొంది గమనోన్ముఖుండై 18

చ. మొగము బిగించి పాదములు మొత్తగా నటు నూదితొక్కి నీ
టుగ మొగ మెత్తి భీకర కఠోరరవంబున నార్చి బాహు ల
త్యగణితలీల నూచి వలయంబుగ వాలముద్రిప్పి వేగునన్
నగము నగమ్ము గ్రుంగ గపినాథుడు నింగికి దాటె తీవ్రునన్ 19

వ. ఇట్లు నింగి కెగిరిపోవుచుండు సమయంబునఁ బావనికి నడ్డంబుగా మానవరూపంబున
మైనాకపర్వతంబును సురస యను నాగజననియు ఛాయాగ్రాహిణియైన సింహిక
యనునుం గనుపట్టిన మొల్లగ నతిక్రమించి సువేలాచలంబున కరిగి యక్కడ నలయిక
దీఱ నొక్క యిక్కువ నించుకసేపు విశ్రమించి యున్న సమయంబున. 20

ఉ. భేరికి సాటియౌ దనుజభీషణభాషణ భద్రనాగఘీం
కారనినాదముల్ హయనికాయపు హేషలు కాహళధ్వనుల్
వీరమృదంగనాదములు విశ్వభయంకరలీల లంకలో
బోరుకలంగగా శ్వసనపుత్త్రుడు చాలగ నాలకింపుచున్. 21

ఉ. కోటి గోటులై పరగుకుంజరవర్గము ఘోటకంబులున్
గోటికి నెక్కుడై పరగు గోత్రసమానము తేరథంబులున్

కోటకి వెచ్చుటై పగలు ఘోర నిశాచరకోటికోట్లతో
నాటిక నెక్కునెప్పుడు సాహసవంతుడు గాంచె ముందరన్. 22

వ. ఇట్లు లంకాపురభేదనంబునన్ వీక్షించి తనమనంబున. 23

శా. ఘోరాకారులు కామరూపులు మహాక్రూరాత్ము లత్యుగ్రులీ
క్రూరుల్ వీరల గన్నుబ్రామి పురిలో శోధించులా గెట్లొకో
యీరూపంబున బోవగా గనిన వారెగ్గెంచ గావింతురో
నారీరత్నము సీత నందు గానగా నాకెట్లు సిద్ధించునో. 24

వ. అని తలంచుచున్న యవసరమ్మున. 25

ఉ. క్రుంకె బయోజబాంధవుడు గూండ్లకు బక్షులు సేరె నెల్లెడన్.
బొంకము తీసె దామరలు పూచెను గల్వలు తారకావళుల్
బింకము జూపె గాంతి నళిబృందము కూరె దమంబుటుపర్వా సే
వంకను జారచోరకులు వాలి చరించిరి కౌతుకంబునన్. 26

వ. ఇటుల నిశాసమయమునందు దనమేనిగాత్రము బిడాలమాత్రంబుగా గుదియించి యగ్గిరి డిగ్గి చనుచు నల్లనల్లన పురద్వారంబునొద్దకుం జేరి వానరకులపుంగవుండు పురప్రవేశంబు చేసి. 27

ఉ. మేడలు రచ్చకొట్టములు మిద్దెలు మచ్చులు నాటకూటముల్
మాడువు లంగళుల్ దనుజమందిరముల్ పురగోపురావళుల్
వాడలు దేవగేహములు వప్రచయంబులు వేశ్యవాటికల్
గోడలు నాదిగాగ గపికుంజరు డప్పుడు చొచ్చి చూచుచున్. 28

క. మఱువులు సందులు గొందులు నిరవులు జోరరాని చోట్ల నేకాంతంపుం
దెరువులు నంతఃపురములు వెరపున గపికుంజరుండు వెదకం జొచ్చెన్. 29

గీ. గాలిలీల సితకరకాంతివిఖ్యాతి ధూమరేఖరీతి దూటి చొచ్చి
యసురమందిరముల నక్కడ నిక్కడ గలయ దిరిగి వెదకె గపివరుండు. 30

వ. ఇట్లు తిరిగి తిరిగి వెదకుచు దనమనంబున. 31

క. మాయాబలుండు రాక్షస నాయకు డిటు బట్టి తెచ్చునా దతనిమహా
కాయంబు సుగ్రాకృతి గని తోయలి తనతనువు నెచటు దొఱగెనొ యకటా! 32

మ. అటుగా కీతడె యన్యదేశమున నాయబ్జాక్షి బెట్టించెనో
ఘటయంత్రస్థితి వార్ధిమధ్యమున దా గ్రౌర్యంబునన్ దాచెనో
పటుబాహాబలశక్తి నాభువనజన్ ప్రాగ్దేశమందుంచెనో
చటులోగ్రాకృతి రామబాణతతులకున్ శంకించి యొందుంచెనో. 33

గీ. సకలలోకంబులుఁ మహోత్సాహవృత్తి నెవ్వనికిఁ జెల్లు బువ్వక మిత్రకిట్టి తియఁగ
నాకెతక్కఁగఁ గలదె యేనాటనైన మద్భుజాశక్తి ప్రతిపోల్ప నద్భుతంబు 47

సీ. శ్వపనుండు లోఁగిలి సమార్జనము సేయ గంధిగానుడు కలయాంపి సల్లఁ
భావకుండమదెంచి పాకంబు లొనరింప శమనుండు వెసఁ బరిచర్య జేయఁ
బాకారికల్పకప్రకరంబు లర్పింప దనుకేశ్వరుండు నైదండయిడఁగ
నరవాహనుండు దానగరివెచ్చము వెట్టి కైలాసుడు విభూతి నెలమిసేయ

గీ. గరుడుడు పంచాంగ మెప్పుడు సరవి జెప్ప నమరకిన్నర గంధర్వ యక్షభుజగ
సిద్ధకింపురుషాంగనల్ చేరి గొలువ వైభవంబున జెలువొందు వాడ ధరణి! 48

ఉ. ఎత్తితి శంకరాచల మహీనబలంబున బంతిఁబోలుగన్
మెత్తితి సర్వదిక్పతుల మానసగర్వము విచ్చిపారగా
నొత్తితి శత్రుభూపతుల నుగ్రరణంబున భూమి దెర్లఁగా
మొత్తితి భోగికంఠము నమోఘజవంబున మేటికీర్తులన్ 49

గీ. జడలు ధరియించి తపసులచందమునను దమ్ముఁడును దాను ఘోరదుర్గమ్ములందు
ఘోరగాయములు కాఁగా గుహఁ జుట్టి రాము సేకేతి లంకకు రాఁగలండు 50

గీ. ఇంకఁ జేయఁ జేరరీ దంగనోపరు కట్టలేరు చుట్టి పట్టలేరు
జలధి దాటి లావు చాలరు నరులకు వచ్చు టెట్లు చెపుము వారిజాక్షి 51

క. దానవు లెప్పుడు మానవ మానవులను గెలువగలరు మదిన్నూహింపన్
మానవభక్షకులైనను దానవులను గెలువ నరులతరమే జగతిన్ 52

క. జగదీశుడు మానవుఁడట నగరే భుజశక్తిచేత నాకెదురన్నన్
నగధరుడో నగధన్వుఁడో! నగభేదియు కొంతకొంత నాతో బోఁగన్ 53

వ. అవి యటులుండనిమ్ము.

క. నీకన్నుల సౌభాగ్యము నీకుచముల కలుకు మేలు నీముఖకాంతుల్
నీకమల లావణ్యము నాగస్త్రీలందు లేవు నారుం జూడన్ 54

మ. సురకాంతల్ సరిరారు యక్షసతుల్ సూటింప నారారు కి
న్నరభామల్ ప్రతిరారు సిద్ధవనితల్ న్యాయంబుగా బోరరా
గరుడస్త్రీలసమానలెంతో చవుకల్ గంధర్వలోలాక్షులున్
మతి యేకీ నిను జెప్పి చెప్పదయువుల్ మత్తేభకుంభస్తనీ! 55

క. వీడ్రిడ యలంకారముగా వాడుము భయముడిగి మధురమైన మృదూక్తుల్
చేసిసల నేలుకన్నుల చూడుము కను తెప్పలెత్తి సుదతీ నన్నున్ 56

వ. అని యిట్లు నోటికి వచ్చినచ్చినట్లు బేలించుచున్న యాతని దుష్టభాషణంబులకు
కోపించి తృణంబు చేపట్టి జనకభూపాలనందన యిట్లనియె. 58

క. పతి దైవముగా నెప్పుడు మతిదలచుచు నుండునట్టి మగువల జెరుపన్
బ్రతిన గలయట్టి నీతో బ్రతివచనము లాడుకంటె బాపము గలదే. 59

క. పరదారాపేక్షకులగు పురుషుల కాయువు నశించు బుణ్యము నెడు స
త్పురుషులు దూషింపగ మది నరకంబు బడుదురనెడి న్యాయము వినవే 60

వ. అదియునుం గాక. 61

క. తన సాహసంబు తానే కొనియాడువతడు హీనగుణుడని వినుచున్
నిను నీవ పొగడుకొంటివి వినగూడదు నీదు నీతివిరహిత భాషల్. 62

ఉ. సంగరరంగమందు నతిశౌర్యమునన్ రఘురాముతోడ మా
తంగ తురంగ సద్భట శతాంగజాలంబులఁ గూడి నీవు పో
రంగను నోప కిప్పుడు విరాధఖరాదుల పాటు జూచియున్
దొంగిలి నన్నుఁ దెచ్చితివి తుచ్ఛపుఁబల్కు లిం పల్కువాడివే. 63

సీ. కూటిమడికిపై గుంపులు గూడనివాడె బెదరక తాటక జీవ మంచె
గాధేయుఁ డొనరించు క్రతువును రక్షింప బెక్కండ్రు దైత్యుల నుక్కడించె
నవని పైవిలసిల్లు నఖిలరాజన్యులు, వేసెంజూపగలేని విల్లువిరిచె
ఘోరాటవులలోన గ్రుమ్మరుచున్నప్పుడు ఖరదూషణాది రాక్షసుల జంపెఁ

గీ. బాదరజమున నాకరాయి బడతి జేసె, లీల మాయామృగంబును గూలనేసె
రాజమాత్రుండె మేదినీరక్షకుండు రామభూపాలుఁ డాదినారాయణుఁడు. 64

గీ. అట్టి రాముని కీయబ్ధి యనగ నెంత దనుజుల పొంత యెంత
నీవనగ నెంత నిలావు చేవ యెంత చెప్పనేటికి నీ జేవ చూచెదవుగాక. 65

శా. వీరాలాపము లాడ నేల నినుమా విశ్వప్రకాశంబుగాఁ
బారావారము గట్టి రాఘవుడు కోపస్ఫూర్తి దీపింపగా
ఘోరాజిన్ నిను డాసి లావుకలిమిన్ గోటీరయుక్తంబుగాఁ
గ్రూరాస్త్రంబుల నీమస్తకముల్ దునిమి భుక్తుల్ పెట్టు భూతాళికిన్. 67

శా. ఉదూఢప్రతిమానవిక్రమకళాహంకారతేజోనిధిన్
శ్రీరాముని సుగుణాభిరాము దెగడన్ జేకొన్న నిన్నాజిలో
దారిన్ దొంగిలితెంచు నిష్ఠురగతిన్ దండించి ఖండింప ము
న్నీరైనను దాటివచ్చు నలుకన్ నేఁ డెల్లి కాంతింపుమా. 67

వ. అని తన్ను జేరికిం గొనక పీరాలాపంబులాడ నారావణుండు పొడవుదప్పిన కాలా
హిచందంబున నుగ్రుండై మండిపడి యిట్లనియె. 68

క. అతిడి గాయని కూరిమి పాటించినకొలది నన్ను బలుకగ జొచ్చెన్
మాటాడకుండ నాలుక తూటులు జేయకున్న దోసముగాదె. 69

క. కయ్యాడక నాముందఱ గయ్యమునకు గాలు దువ్వగడగెను దీనిన్
దయ్యాలకు బలివెట్టెద వ్రయ్యలుగా నఱికి యెల్లవారును జూడన్. 70

క. కాకున్న దీని బలిమిని గైకొని నాకాంక్ష దీఱ భావజకేళిన్
జేకొనక విడిచి పెట్టిన గైకొనునే నవ్వుగాక గర్వము పేర్మిన్. 71

శా. భీమాటోపభుజప్రతాపమహిమన్ భీమాచలం బెత్తి నా
త్రామాద్యష్టదిగీశసైన్యముల సంగ్రామంబులో నోర్చియు
ద్దామప్రౌఢిం జెలంగుచుండెడు కళాధాముండ నాముందటన్
రాముఙ్ గీమునిఁ జెప్ప గిప్ప నగరా రాకేందుబింబాననా 72

సీ. అఖిలలోకముల నాయాజ్ఞ నిల్పితి నేక హేలను బుష్పకం బెక్కి తిరిగి
వేల్పుమూకలచేత వెట్టి సేయించితి దితివంశవల్లభుల్ నుతులు సేయ
గణములతో గూడ గైలాస మెత్తితి బటువైనపూవులబంతిపగిది
వనజగర్భునిచేత వరములు గైకొంటి దండిగా నత్యుగ్రతపము సల్పి

గీ. చెఱలు పట్టితి గంధర్వ సిద్ధ సాధ్య భుజగ సుర యక్ష కిన్నర ముఖ్యసతుల
నిట్టిసామర్థ్య మెవరి కేనాడుగలదు మహిని నాకొక్కనికె కాక మంజువాణి!

గీ. నాకు నెదురింప నొకపేద నరుని న్నొడ్డి వెఱవకీరీతి దుర్భావముల నచుదీని
జిహ్వ మొదలంటబట్టి యీ శితకుఠార, ధార దునుమాడి ధారుణి బాఱవైతు

వ. అని చంద్రహాసంబు జంకించి లేవ నుంకించుతఱి గొందఱు ప్రియసుందరులడ్డంబు
సొచ్చి.

చ. సురవరుడో ధనంజయుడో సూర్యతనూజుడో యాతుధానుడో
శరధివిభుండో గాడ్పో పురశాసనమిత్రుడో భోగిభూషుడో
గురుభుజశక్తిగైకొనుచు గోపమునూపగ నీకునెంత యి
త్తరుణిపయిం బ్రతాపమున దారుణకృత్యము సేయగూడునే.

క. ఏటికి మీరిటు కినియగ నాటుప్రజంకెగదె చాలుగరవాలునకే
యాటది యర్హమె మము నీ మాటికి మన్నించి కావుమా యిక జాలున్. 77

వ. అని కాంతవచనంబుల ప్రియంబు చెప్పిన నప్పంకరువాత్మజుల విన్నపంబులు మన్నిం
చి యాతుధానచక్రవర్తి వైదేహికి గావలియున్న యేకజటా ద్విజటా త్రిజటా

సీ. అర్కసంభవునకు నభయంబు దయచేసి దుందుభికాయమ్ము దూలదన్ని
యేడుతాడులు సర్వ మేకమ్ముగా ద్రుంచి వాలినద్భుతశక్తి గూలనేసి
సుగ్రీవునకు దా నృపతిగా నిల్పించి యంగదు యువరాజనంగ నిలిపి
వారలతోడను వానరసైన్యంబు నెన్నేనిక్రాలువంగ నేగుదెంచి
గీ. మాల్యవంతంబునందుండి మనుజవిభుడు నిన్ను వెదకంగ నందర నన్నిదిశల
బనుచునప్పుడు దక్షిణభాగమరయ నంగదునితోడ గొందఱ మఱుగ నేర. 99
గీ. వారిపంపున నవలీలవార్ధిదాటి వచ్చి సకలంబు జూచి యీవంక గంటి
రావణుడు వచ్చి నిన్ను నుగ్రంబు గాగ బలుకునప్పుడు నున్నాడ బాదపమున.
వ. ఇవ్విధంబున బలుకుచుండినను నమ్మక యతని నింగనుంగొని రాముం డేరీతివాడో యతని చందం బెఱింగింపు మనవుడు వాయునందనుండు రఘునందనునకు వందనం బాచరించి భూమినందన కిట్లని చెప్పుచున్నాడు. 101
సీ. నీలమేఘచ్ఛాయ బోలు దేహమువాడు ధవళాబ్జపత్రనేత్రములవాడు
కంబుసన్నిభమైన కంఠంబుగలవాడు బాగైనయట్టి గుల్ఫములవాడు
తిన్ననై కనుపట్టు దీర్ఘబాహువులుగలవాడు ఘనమైన దుందుభిస్వరమువాడు
పద్మరేఖలుగల్గు పదయుగంబులవాడు చక్కనిపీన వక్షంబువాడు
గీ. కపట మెఱుగని సత్యవాక్యములవాడు రమణి! రాముండు శుభలక్షణములవాడు
ఇన్నిగుణములు రూపింప నెసగువాడు వరుస సౌమిత్రి బంగారువన్నెవాడు
గీ. ఉరుతరాటవిలోన మహోద్రితపము వాయుదేవుని గురియించి వరుసజేసి
యంజనాదేవికనియె నన్నర్థితోడ నర్కజునిమంత్రి హనుమంతుడందు రన్న
వ. అని యిట్లు తాత్పర్యంబున బట్టునట్లుగా విన్నవించి దేవీ! నీవేవుండయిన శ్రీరాముండు నాచేతికిచ్చి యంపిన నూత్నరత్నాంగుళీయకంబు నీకు సమర్పించితి. ఇంక నాకు రిక్తహస్తంబులతో జనుట దూతల కుచితమైన కార్యంబు కాదు గావున నన్ను దర్శించి నందులకు శ్రీరామునకు నమ్మికపుట్టునటులగా నీ శిరోరత్నంబు దయచేయవలయు ననుటయు నాకు జనకజయిట్టులనియె. 104
క. నానాథుక్షేమమంతయు దీనిధి! నీచేతవింటి దెలియగనైనన్
నీనిజరూపము జూడక నేనారత్నంబు నమ్మి నీకీయజాలన్. 105
వ. అనుటయు నాహనుమంతుడు 106
క. చుక్కలు తలపూవులుగా నక్కజముగ మేను పెంచి యంబరవీథిన్
వెక్కసమై జూపట్టిన నక్కోమలి ముదమునొందె నాత్మస్థితికిన్

వ. ఇటుల లిన మహోన్నతరూపము మాపి యెప్పటియటుల మరి సూక్ష్మరూపంబును
గైకొని నమస్కరించిన యాహనుమంతునకు నద్దేవితనశిరోరత్నంబునను గ్రహించి
యిట్లనియె. 108

చ. రవికులవార్ధి చంద్రుఁడగు రాముని సేమము చాల వింటి నా
వివిధములైనపాట్లు పృథివిపతికిఁ దగఁ జెప్పఁగల్గె నే
డవిరళభంగి నీవలన వచ్చుఁగ నేనుపకార మేమియున్
దవిలి యొనర్పలేను వసుధాస్థలి వర్థిలు బ్రహ్మకల్పముల్. 109

వ. యిట్లు దీవించి మఱియును

క. ఏనుడ జూచిన ధరణి నాయకు శ్రీపాదయుగము నాచిత్తములోఁ
బాయ దని విన్నవింపుము వానరతనూజుండ పుణ్యవంతుడ తెలియఁగ. 111

గీ. ఇపుడు రావణుఁడే తెంచి కపటబుద్ధి గర్వముల జేసి నన్నెన్ని కాఱు లాడె
నన్నియును నీవు చెవులార విన్న తెఱఁగు పతికి దయ పుట్టగా విన్నపంబుసేయు

సీ. కుడుద వెన్నెటి వేణి జడలుగా సవరించి మలినజీర్ణాంబరంబొలియగట్టి
భూమీరజంబు విభూతిపూఁతగ బూసి తనదివ్యమూర్తి చిత్తమున నిల్పి
నిరళనస్థితితోడ నిలిచి భూశయ్యను బవళించు నిదుర యేర్పడగ విడచి
తారకబ్రహ్మమంత్రంబు బఠింపుచు గఠినరాక్షస దుర్మృగములలోన

గీ. సహితలంకామహాద్వీపగహనసీమ దపము సేయుంచు సేయుచు నున్నానుదన్ను గూర్చి
నాకు బ్రీత్యర్థ మగునని నాథునకువిన్నవింప్రుము సత్త్వసంపన్న నీవు. 113

వ. అని చెప్పి మఱియును

చ. జనకుని భంగి రామనృపచంద్రుని నన్నును దగ్గమాఱుగా
గని కొలువంగ నేర్చు గుణగణ్యుని లక్ష్మణు నీతిపారగుఁ 106
విన గనరానిపల్కు లవివేకముచేతను బల్కినట్టి యా
వినుత మహాఫలంబను భవించితినంచును జాటిచెప్పుమా

క. ఆమాటలు మదినుంచక నామానము గావు మనుచు నయవినయగుణో
ద్దాము సను రాముని తమ్ముడు సౌమిత్రికి జెప్పవయ్యా సాహసివర్యా! 116

వ. అని యిట్లు జనకరాజతనయ పలికినపలుకు లాలకించి హనుమంతుం డాజననితో
నిట్లనియె. 117

క. ఇనుఁడుదయింపకమున్నే వననిధి లంఘించిమనుజవల్లభుకడకుఁ
జను గొనిపో పెద నీపునజననీ! కూర్చుండు మనిన సంతోషమునన్ 118

క. నీవంతవాఁడ వగుదువు నీ వెంట నేని నెగడవు కీర్తుల్
రావణునిక న్న మిక్కిలి భూవరుదేవేరు యందుబ్రబుధనుతచరితా. 119

వ. అదియునుం గాక రామచంద్రునిం దప్ప నితరుల నంటుదానం గాను గావున నీతో
రాదగదు మఱియును. 120

క. దొంగిలి తెచ్చిన దైత్యుని సంగతు లకువాని వారి సాహస మొప్పన్
సంగరముఖమున జంపక దొంగిలి కొంపోవదగునె దొరలకు నెందున్ 121

వ. మఱియు రామచంద్రుండు త్రిజగదేకవీరుండును గోదండదీక్షాగురుండును రాక్షస
కులాంతకుండును నగుటం జేసి రాణివాసద్రోహి యగు రావణుని సంగరంబున
బ్రఖ్యాతంబుగా జంపి కొనుపోవుట ధర్మంబు నీవు రామచంద్రునకు బరమభృ
త్యుండవును బుత్రసముండవును నగుటం జేసి నీ వెంట నరుగుదెంచుట తప్పు గాకపో
యినను బగ తీర్పక వచ్చు టుచితంబు గాదు గావున నీవు రఘువీరున కిన్నియుం
దెలియ విన్నపంబు సేసి తడయక తోడ్కొని రమ్మనిన నద్దేవికి నమస్కరించి హను
మంతుం డిటులనియె. 122

ఉ. నీవిభు డబ్ధి దాటి ధరణీతలనాథులు సన్నుతింప సు
గ్రీవ సుషేణముఖ్య బలబృందముతో నరుదెంచి నీచునిన్
రావణు నాజిలో దునిమి రాజస మొప్పగ నిన్ను గొంచు నే
నావలితోడ నీపురికి నారయ నేగు నిజంబు నమ్ముమా 123

వ. అని విన్నవించి సముద్రుండై యద్దేవిచేత దీవనలు పొంది మరలి చనుచున్న వాడై తన
రాక రావణున కెఱుంగ జేయవలయునని తలంచి. 124

సీ. మేదినిసమముగా మేడలు గావించి కేళీగృహంబుల నేలగలిపి
కమలాకరంబులు కలచి గారలు వెట్టి వృక్షజాతంబుల విఱుగదన్ని
పుష్పగుచ్ఛంబులు పుణికి పాలుగ వైచి తేనెలు రాల్చి పూదేనె లుడిపి
పొదరిండ్ల పాదపులు చదియగా నుగ్గాడి చప్పరంబుల నేల చదును జేసి

గీ. వనము గాచెడి రాక్షసవర్గములను వీరవరులను నెనిమిదివేల జంప
సీత గాచెడి రాక్షసస్త్రీలు బెదరి పాఱిపోయిరి రావణు పాలికంత 125

వ. ఇటుల రావణుం జేరి వారు 126

క. దేవా! నేడొక మర్కటు డేవిధమున వచ్చినాడొ యెఱుంగము సీతా
దేవిం గని మాటలాడియు బోవుచు వనమెల్ల బెఱికి ప్రోవిడి కడకన్ 127

గీ. వనము గాచెడి రాక్షసవర్గములను దండితాకని మిడివోవకుండ బట్టి
మేటిభుజశక్తి నందఱ గీటడంచి వాలియున్నాడు సాహసవంతుడగుచు

వ. అని విన్నవించినంతనే క్రోధరక్తాంతలోచనుండగుచు నవ్వింశతిలోచనుండు విచా

రించి వాడు రామునిపంపున వచ్చినదూతకాబోలు వానిం జంపుండని పదివేల
రాక్షసుల బంపిన 129

క. ఉగ్రాకారుండగుచు దశగ్రీవుండనుప దనుజసంఘంబులు దా
మాగ్రహమునజనుచు బలోదగ్రక్రోధాత్ములగుచు దాకిరి కడిమిన్ 130

ఉ. తాకినంత వాయుజుడు తానదలించి కఠోరరేఖతో
వీక నెదిర్చి పేర్చి రణవీధిని ఖేచరసైన్యమెల్లనా
తుక్కడు వెంటనంటి సమదోగ్రబలంబున ఛాఱఛాఱగా
దోకనుజొట్టి మోదె బలదుర్గముల దునుమాడెనందఱన్ 131

క. అందునజావగ మిగిలిన కొందఱు పఱతెంచి యసురకొల్యాన మొఱ్ఱో
యందఱ మ్రింగెను వానవు లందఱకును వీడు దారుణాంతకుడగుచున్ 132

వ. అని విన్నవించిన రాక్షసేశ్వరుం డగు రావణుండుచుండిపడి పింగళాక్షుని దీర్ఘజిం
హ్వుని యశ్మవక్త్రుని శార్దూలముఖుని వక్రనాసుని బనిచిన వారునుందమతమబలం
బులంగూడుకొని రథారూఢులైవచ్చి యార్చుచుం దాకి శస్త్రాస్త్రంబులడరించిననవి
యెల్ల లెక్కగొనక యక్కపికులతిలకుండు దర్పంబునం బేర్చి వాలమల్లార్చియెదిర్చిన
జలంబును బలువిడి గాదోలి పింగళాక్షుని ద్రుంచి దీర్ఘజిహ్వు దీర్ఘనిద్రపుచ్చి
వక్రనాసుని బరాక్రమంబున చూర్ణంబుచేసి యశ్మవక్త్రుని భస్మంబుచేసి శార్దూల
ముఖుని మర్దించి సర్వశ్రీపరాక్రమంబున గర్వించి మరలి మకరతోరణంబు నారో
హించి యార్చుచున్న సమయంబున. 133

క. చావక మిగిలినదైత్యులు రావణుకడకేగి వేగ రాహుత్తులపా
టూ వాయుజు సాహసమును వివిధముల జెప్ప నతడు విస్మయపడుచున్ 134

మ. కుటిలభ్రూకుటి దుర్నిరీక్షణముఖం గ్రోధానలజ్వాలలు
త్కటమై పర్వగ మంత్రినూనుల మహోగ్రవ్యాంధులన్ క్రూరులన్
బటిబాహాబలు లార్వురం బనిచె కుంభద్విక్రమాటోపము
ర్కటుపై రిందముమీద నుద్ధతి సంగ్రామంబు గావింపగన్ 135

వ. ఇట్లు పనిచిన నాయార్వురును 136

సీ. శతకోటివిక్రమప్రతిమానుడైనట్టి శతజిహ్వు డత్యంతసాహసుండు
రోషానలాభీల భీషాహియైనట్టి రుధిరాక్షు డత్యగ్రరూపయుతుడు
పరసైన్యకాననపావకుండైనట్టి రక్తరోముడు మహారణబలుండు
క్షితివరాత్రివలోకగజసింహుడైనట్టి శూలదంష్ట్రుడు లయకాలయముడు

సీ. వ్యాఘ్రికబలుండు పృథుతరవైరిజయుఁ డ్రస్తనితహస్తుండు సాహసోదారబలుఁడు
వీరు లాఖ్య దనరు గ్రీవేషములను గూడి వెడలి ఘనరథారూఢు లగుచు 137

క. తమతమబిరుదలు సెరపుచు దమకంబున వెడలి తండముగొలువన్
ఘుమఘుమ భేరీరవసం భ్రమములతో మంత్రిసుతులు పావనిమీదన్. 138

వ. ఇట్లు దివి సింహనాదంబు లంబరంబునం జెలంగ జతురంగతాంగసుభటనికరంబు గూడి శస్త్రాస్త్రంబులం బోరవిన 139

గీ. వాలమల్లార్చి బ్రహ్మాండకోళ మెల్ల వగల నార్చుచు భుజయుగ బప్పళించి
రణముచేయంగ మకరతోరణము డిగ్గి మంతు కెక్కిన యామహామంతు డంత

సీ॥ ఒక్కొక్కరథముతో నొక్కొక్కరథము విటతాటనంబుగా విరుగఁ గొట్టి
యొక్కొక్కగజముతో నొక్కొక్కగజమును జాపచుట్టగ బట్టిచావగొట్టి
యొక్కొక్కహయముతో నొక్కొక్కహయమును గమిడితో నలినలిగాఁగ గొట్టి
యొక్కొక్కభటునితో నొక్కొక్కసుభటుని వడిద్రిప్పి చెక్కులువాఱ గొట్టి

గీ. బాహుబలగర్వమున జేర్చిప్రధనసీమ మంత్రిసూనులనార్వుర మడియఁగొట్టి
మకరతోరణమున విక్రమమ్ము మెఱయ భీకరాకారుడై యుండు బెమ్ము పెరిగి

క॥ ఆరణవీథిని నిలువక పాఱిన హతశేషులెల్ల బల్వడి రాజ
ద్వారమునకు బోల్పడి రాఘోరాజిని మంత్రిసుతులు కూలి రటంచున్ 142

వ. వారలపల్కులు విని రావణాసురుండదరిపడి యాజ్యాహుతిం బ్రజ్వరిల్లుహుతాశనుం
బోలి మండిపడి ప్రహస్తతనూజుం డగుజంబుమాలిం గని నీవానరాధముని వధించి
శీఘ్రమ్మ రమ్మని యనిపిన 143

ఉ॥ అప్పుడు జంబుమాలి భయదాకృతి వీరరసాప్తిఁ గన్నులన్
నిప్పులురాల బేరలుక నిండఁగ నూర్పులు పర్వజిత్రమై
యొప్పగ రొప్పుచున్ రణమహోత్సుకుడై గజవాజిబృందముల్
విప్పగ వెంటరాగ గపివీరు నెదుర్కొనవిక్రమంబునన్ 144

క॥ అదలించి వాయునందను బ్రిదరంబుల వేయ నంత పవనజుఁడలుకన్
గొదగొద బలముల నన్నిటి గదియంగా మోదె నొక్కసాముచేతన్ 145

ఆ. రథము నుగ్గు రథసారథిని జంపి రథతురంగముల బృథులశక్తిఁ
బట్టి వాలమునను బడగొట్టిచంపిన జంబుమాలి కినిసి సాహసమున

క॥ అశిదంబున గదయును గొని పృథుశక్తి లంఘించి వాయుపుత్రుని ఫాలం
బెడపక వేసిన ధరణిం బడిమూర్ఛ మునింగి తెలిసిబలయుతుఁడగుచున్. 147

క. తలంబున నాతని కర వాలంబును ద్రుంచివైచి వరభుజశక్తిన్
నేలం గూల్చెను విక్రమ శాలిన్ వడిజంబుమాలి సాహసశీలిన్ 148

ఆ. అట్లు జంబుమాలి యత్యంతబలశాలి గర్వమెల్లదూలి కలనవ్రాలి
పోలి సెననుట దైత్య పుంగవుం డాలించి యాత్మ సంచలింప నాగ్రహించి 149

క. సాహసము వెలయ సమరో త్సాహంబున దుష్టకపిని జంపుమటంచున్
బాహుబలాఢ్యుని నదినిక ర వావసంహారు వీరు నక్షకుమారున్ 150

వ. అంపిన నతండు 151

సీ. చిత్రమాణిక్యరంజిత నేత్రవిభవంబు భానుకోటిప్రభా భాసితంబు
భీకరధ్వజదండబిరుదాలవాలంబు శస్త్రాస్త్రపరికర సంయుతంబు
బంధురాధికజవబహువాహనోపేతంబు కుటిలదిక్పాల దృగ్గోచరంబు
ఘననభోమార్గవిఖ్యాతైకగమనంబు వరతపోలబ్ధాతివైభవంబు

గీ. నైనరథమెక్కి మదవారణౌఘసుభట వీరహుంకార ఝంకారవారములియ
గదలె హనుమంతుపైకి నాగ్రహామెసంగ మదముడై వారనక్షకుమారుడలుక

క. అటుచని పావనిగని దిక్తటములు సెదరంగనార్చి దండడి భూభృ
త్తటముపయి గురియువర్షో త్కటధారలరీతి నంపధారలు గురిసెన్ 153

ఉ. వాయుజుడప్పుడాపగమి వాలముఖంబున ద్రుంచె ద్రుంచినన్
వాయుజుమీద గ్రమ్మఱ నవార్యబలంబున నేసె నేసినన్
వాయుజుడుగ్రుడై తునిమె వానిశరావళి నెల్లబిమ్మటన్
వాయుజు నాటనేసెగడు వాడిశరంబుల నక్షుడుద్ధతిన్ 154

వ. ఇటులేసిన 155

ఉ. తాలమహీజరాజిని రథంబును గూలగ మోదె మోదినన్
నేలబడాతిరైనిలిచి నేర్పున వాడు శరాళిమారుతిన్
ఫాలమునొందె నొంచినను పావనిమూర్ఛిలి తేటిదానవున్
దూలగముష్టిచే బొడిచె దోర్బలశక్తి రణాంగణంబునన్ 156

వ. పొడిచినమూర్ఛిల్లి వడిదేరి దైత్యుండు గదగొని వైరి వక్షంబుపగుల
వైచినమారుతి వడి వానిగదబుచ్చుకొని వాని దేహంబు గుదియ నేసి
నేసినదనవీక నోసరింపక వాడు గగనంబు కెగసె నాక్షణమునందె
వాయుతనూజుండు వదలక తన వెంట నెగసినన్ గదగొని యేసె నతని

తే. నతడు గద ద్రుంప ఖడ్గాననతులశక్తి వాడు మారుతితోడలు నొవ్వంగ నడచె
నంత సోలుచు నాహనుమంతుడెగిరి పట్టుకొని వాని భూమిపై గొట్టి చంపె

విమర్దనుండవు మత్సమానశౌర్యచాతుర్యధుర్యుండవు గావున నీ కసాధ్యంబగు కార్యం బెద్దియుఁ లేదు నీ విపుడ పోయి వాని సాధించి రమ్మని పంచిన 167

సీ. మాణిక్య తపనీయమయ విమానముతోడ గెంబట్టు బీరదు టెక్కెంబుతోడ
సరిచెప్ప రాని శస్త్రాస్త్రములతోడ బలమైనదివ్య చాపంబుతోడ
సాహసకోవిదుండైన సారథితోడ ఘనసత్త్వజవతురంగములతోడ
గనుపట్టెదిక్కుల గగనయానముతోడ బాలసూర్యోదయ ప్రభలతోడ

గీ. గరమువిలసిల్లురథ మెక్కి గంధనాగ తురగరథభటవందిసందోహపటహ
శంఖకాహళదుందుభిస్వనములోలయ మేఘనాథుండు హనుమంతు మీదవెడలె

లయగ్రాహి

పెక్కులగుఱ్ఱములు ఠొక్కుపురథంబులును
నెక్కువగు నేనుగులు గ్రిక్కిరిసి రాగా
రక్కసులు సేరి యిరుప్రక్కలను గొల్వగడు
నుక్కునను మీఱి చలమెక్కుడుగ నంతన్
గ్రక్కదలభూతలము చుక్కలొగి రాల శిల
లుక్కసిలి నాదములు పిక్కటిలి మ్రోయన్
డెక్కములమించి జవమెక్కుడుగ బాపుదళ
మక్కజము గానదుర నుక్కులు వదకన్

వ. ఇటుల భయంకరాకారంబున వెడలి కంఠహుంకృతులును భేరిభాంకృతులును నంబరంబున జెలంగఁ బొంగి చనుదెంచుచున్న రాక్షససైన్యంబుం గనుంగొని హనుమంతుండు తోరణస్తంభము పైనుండి బధిరీభూతదిగంతంబుగా భీకరగతి నార్చిన

క. కలగినవి దేవగణంబులు జలధులుఘూర్ణిల్లె గిరులు జలనంబొందెన్
జలజాప్తచంద్రులాదిరిగి జలధరములు పతీయులగుచు జదలంబర్వెన్

క. అప్పుడు దానవీరులు నిప్పుడువర్షించునట్టి నిశితాస్త్రములన్
గప్పిరి కొండొగవానల గప్పినశైలంబుబోల గపివరులమీదన్ 172

తే. అంపవర్షంబుతనమీదబొంపములుగ రీలగురియంగనవియెల్ల నెక్కగొనక
భువికిలంఘించు యప్పుడద్భుతముగా గవాలమల్లార్చి యొక మహాసాలమెత్తి
తేరులన్నియుదూరాటితేరులుగను గుఱ్ఱములనెల్ల గావేరిగుఱ్ఱములుగ
నేనుగుల నెల్ల వెడరూపు జేనుగులు గదళములన్నియుమతి పారదళము గాగ

వ. ఇటుల సమయింపంజూచి బలంబుపై కురికి 176

సీ. కరియూథముఁ మీద గదిసి మావంతుల తోడఁగూడఁగఁబట్టి తుంచి యగొట్టి
గుఱ్ఱంపుఁబౌజులఁబను దాటిరౌతుల గలయంగఁబట్టి చెక్కులఁగ గొట్టి
రథముల పైకినుఁగ్రింబుగాలంఘించి రథికులతో గూడ రసనుగొట్టి
బలములమీఁద నిబ్బరముగా గుప్పించి వాలముఖంబున దూలఁగొట్టి
తే. పటహనిస్సాణకాహళపటిమఁ జెరియ దొరికిన శస్త్రాస్త్రనిచయముల్ తుమురుచేసి
ధరిత్రిములఁద్రుంచి పడఁగలసత్వమణఁచి పవనకూనుండు సాహసప్రౌఢి మెఱసె
క. అట్టి సమయంబున.
చ. అలనమరీతిమండి దివిజాతనూజుండు తేరుదోలి య
య్యనిలతనూజు సేసె వివిధాయుధపంక్తుల వానిసెల్ల దు
త్తునియలు సేసె వాయుజుఁడు దోర్బలశక్తిని దైత్యుదేహము దో
కనుదునుమాడె వానివిశిఖంబులనన్నిటి వాయునూనుఁడున్
క. గిరులునువందలకొలదిగ దరువులు సేయంగగినిసి దానవుఁడంతన్
దురమునఁ దుమురొనర్చెను శరజాలముచేత నాక్షణమునవానిన్ 179
గీ. గంధవహపుత్రు డప్పుడాగ్రహముతోడ రథముగూలంగ దన్ని సారథి నదుమి
గుఱ్ఱములఁజంపి కేతువుఁగూలనడప మేఘనాథుండు కినిసి సమీరసుతుని 180
వ. అహంకారంబుల బ్రిత్రిఘటించి 181
క. వాయ్వస్త్రమునంతట వాయుజుమీదికినతండు వడి నేసిన నా
వాయువ్యాస్త్రముదూలెను వాయుజునింజంపనోడి వారనికరుణన్ 182
వ. అది వృథయగుటంగని మఱియును 183
క. రౌద్రంబడరఁగ నేసెను రుద్రాస్త్రంబతనిమీఁద రూఢిగనత డా
రుద్రాంశయంశంబగుటను రౌద్రాస్త్రముదేలిపోయె రభసంబొప్పన్ 184
వ. అమ్మహాస్త్రంబుగూడ దప్పిపోవుట నాశ్చర్యము నొంది యింద్రజిత్తు మఱియును
క. సురఖచరయక్షకిన్నర గరుడోరగ సిద్ధసాధ్య గంధర్వగణం
బరుదందిచూడఁగ నిర్భరముష్టిందొడిగియేసె బ్రహ్మాస్త్రంబున్ 186
వ. అట్టి యవసరమున 187
క. సప్తాంబోధులుదల్లడిలెను సప్తద్వీపములవణకె శైలములదరెన్
సప్తాశ్వముఁ బెదరెనుసప్తాశ్వుఁడు మాఱ్ఱిను పడిరెయంగములంగదలెన్ 188
వ. ఇట్టులనేకప్రకారంబుల గాలాగ్ని లెలుంగున వెనలి మిడుంగురులు చెదరిపడఁగ
బ్రహ్మాండమండలంబులు బాటుకొనినట్టుల వెనుమంట యుప్పరం బెగయనేతెంచు
బ్రహ్మాస్త్రమునుగని హనుమంతుండు తన మనంబున 189

క. ఖండించెదనీ చేతులు తుండించెదనడుము రెండుతునకలు గాఁగన్
జెండించినీదుకడలు వండించెద జమునితోన వాచెవిగలుగన్ 200

వ. ఇట్లుపట్టరాని కోపంబున నాటోపంబుగా నుబకుచున్న రావణాసురునిం జీరికిం గొనక హనుమంతుడిట్లనియె.

క. ఇనతనయుని వరమంత్రిని జనపతియైనట్టి రామచంద్రునిదూతన్
ఘనుఁడగు వాయుకుమారుఁడ హనుమంతుం డండ్రు నన్ను నార్యులెల్లన్.

క. రాముని పంపున వచ్చితి రాముని సేమంబు నిందు రంజిల్లెడియా
రాముని సతికెరింగించితి రామునికడ కేగుచుంటి రాజసవృత్తిన్ 203

క. నాగాక మీకు దెలియఁగ బీరంబున వనము కలయబెరికితి శక్తిన్
ఘోరాజి నాకు నెదిరిన వారల జంపితిని యమునిపట్టము చూడన్ 204

క. నిను జూచి తిరిగిపోయెదు మనమున మటి కట్టుబడితి మనుజాసన నీ
యను వెల్లగంటి శంకను వినుమా నాబుద్ధి దెలియ వివరముతోడన్. 205

చ. ఘనుడవు నీతిమంతుడవు కార్య మెఱుంగుదు సాహసంబునన్
నిను నెదిరించి పోరుటకు విగ్రహవల్లభు డోపలేడు నీ
వనిన జగత్త్రయుం బళుకు నద్భుతరూపము సెప్పరాదు నీ
యనుపమభోగసంపదల కాఱడి తెచ్చితి నిష్ఠ రావణా 206

క. కడలేని బలము ధర నెక్కడ లేనిమహాధనంబు కరితురగంబుల్ 107
కడ గానరానిసంపద చెడకుండఁగ నీకు బుద్ధి సెప్పెదవినుమా 207

సీ. కదియించి సింహంబుకోరలు నెఱుకంగ శేషాహిదౌడలు చీల్చివేయం
బీడించి దంభోళి బిడికిట బట్టంగ గటినకాకోలంబు కడి టొనంగ
జలగి బ్రహ్మాండమ్ము చిప్ప లూడఁగ దన్న హంకారమున బడబాగ్ని నురుక
నంభోనిధానంబు లరచేత నడపంగ గిరివర్గముల దలక్రిందు చేయ

తే. గలమహాబాహుసత్త్వవిఖ్యాతవిపుల చండభుజదండసాహసోద్దండవిజయ
కాలరుద్రావతార సంగ్రామభీమ మూర్తి మంతులుకపులుసత్కీర్తియుతు 208

వ. అదియునుంగాక దశరథరాజనందనుండును గౌసల్యాగర్భసంభవుండును తాటకాప్రాణాపహారుండును విశ్వామిత్రయాగసంరక్షకుండును నహల్యాశాపవిమోక్షదీక్షాగురుండును హరకోదండఖండనుండును జమదగ్నిబాహుబల భంగుండునువిరాధనిగ్రహుండునుఖరదూషణత్రిశిరశ్ఛేదనుండును మాయామృగసంచారిమారీచసంహారకుండును గబంధాంతకుండును వాలిప్రాణవిభగ్నుండును సుగ్రీవరాజ్యసంస్థాపనపరమాచార్యుండును ధనుర్విద్యాప్రవీణుండును నమోఘబాణుండును శాంతసకలాం

తముండును గాక స్వాన్వయాంభోనిధిచంద్రుండును గరుణాసింధుండునునగు శ్రీరా
మచంద్రుండు కరుణాలంకారుండు గావున 209

ఉ. వారక సీతనిచ్చి రఘువల్లభునిన్ శరణంబు జొచ్చినన్
మీరము లెంచి చంపఁడిఁక నీయెడ కెప్పుడు నేను బూటగా
భారపడంగ జాలుదు శుభస్థితి నమ్ముము నమ్మ కూరకే
పోరగ జూచితేని బొరిపుచ్చక వానడు నిన్ను రావణా 210

ఉ. నావుడు మండి దైత్యకులనాయకు డుగ్రవిలోకనంబులన్
బావకవిస్ఫులింగములు పైకొనిపాఱఁగ వీరఘోరవై
జ్యావళిఁ జూచి మీరలు మహావిశిఖంబుల వీని జంపుఁడీ
యావల నాముకులుక్కుచు భయాతురులై చెడిపోవునట్లుగన్ 211

వ. అనిన విభీషణుం డిట్లనియె 212

క. దూతపని బూనివచ్చిన దూతలు తమనోరికేమి తోచినట్లా
డేతల నాడుదురాడిన దూతల జంపంగదగదు దొరలకు నెందున్ 213

క. కాకుండిన మీచిత్తము కాకెల్లను దీరముజ్జగంబులు బెదరన్
డాక సదలించి తోకను వీకనుమట్టించి పోవిడుచుటచాలున్. 214

వ. అనివిన్నవించిన. 216

తే. నీతివాక్యసరణి నెరయంగ విని రావణేశ్వరుండు కోప మెడలి పలికె
వీని తోక గాల్చి వెడలంగ ద్రోయుఁడీ పొద్దియుటకు దిరిగిపోవు గాక

వ. అని యుత్తానతిచ్చిన విని రాత్రించరు లతని సభామధ్యంబునుండి బయటికి వెడలం
గొనిపోయి యొక్కచోట. 217

ఉ. వాలము నిండ గోకలు జపంబున కట్టిక జుట్టి వానిపై
దైలము చక్కజల్లి పిదపం జని పౌరులు చూడ బావక
జ్వాల దగిల్చి బొబ్బలిడి వాడల ద్రిప్పుచునుండ వా
తూలవుండు దానికిని దూలక వహ్నిజపంబు సేయగన్

గీ. అగ్ని దేవుడప్పుడాత్మలో జింతించి హితుడు నాకు లోకహితుడు పవను
డతని పుత్త్రుండైన హనుమంతునకు నేను జలువగూర్తుననుచు జల్లనయ్యె 218

వ. అప్పుడచ్చటివృత్తాంతం బంతయు దనకు గావలియున్న రాక్షసకాంతలవలన విని
చింతాభరక్రాంతరై జనకరాజనందనంబు శోకించి కరంబులు ముకుళించి జగ
ద్ధితపార్శ్వగుణ్యుండును రాఘవప్రియానుచరుండును మత్ప్రాణబంధుండును జగత్ప్రా
ణనందనుండు నైన హనుమానునకు సీతలుండవు కమ్మని యగ్నిదేవునకు నమ

శా. నేనే చాలుదు రావణాసురతలన్ నేలం బడం గొట్టగా
నేనే చాలుదు వానిపట్టణము ముచ్చిట బడం ద్రోయగా
నేనే చాలుదు దుష్టదానవతతిన్ నిర్భీతి దండింపగా
నేనే చాలుదునంచు బంతములు ప్రాల్కొంబల్కుచున్ గ్రుచ్చుచున్ 230

క. ఆ రాత్రి కీశు లందఱు మారుతితో గూడి నిలిచి మఱునాడ చటన్
ధీరత దుర్ధరశైలము, చేరంజని నిద్రచేసి చిత్తములలన్ 231

వ. అమ్మఱునా డుదయంబున మధువనంబులో బ్రవేశింప నుద్యోగించి యందఱు
కన్నను పెద్దవాడగు జాంబవంతునిం బిలిచి నీవు శ్రీరామునకు హితుండవు సుగ్రీ
వునకు మంత్రివి కావున మామ నొక్క బుద్ధి యానతిమ్ము ఈకపులు క్షుద్బాధావ
శంబునం బారలి మహాశ్రమంబును బొందియున్నవారు గావున సుగ్రీవుని మధు
వనంబునం దుండెడు ఫలంబులం బరితృప్తులమై రామునిసన్నిధానంబునకేగుట లెస్స
యని యంగదహనుమంతులుపల్క జాంబవంతుండును నత్యుత్సాహంబున నంగీక
రించి కపులం బురస్కరించుకొని మధువనంబులో బ్రవేశించినంత. 232

సీ. ఒక్కఁడాకొని కొమ్మలూచినబండ్లెల్ల జేకొని తేర భక్షించు నొకడు
ఒక్కఁడాగొని కేపుచున్నట్టి తేనియల్ తడయక గొల్లాడి త్రాగు నొకడు
ఒక్కఁడాకొని కోయుచున్నట్టి కాయలు మిన్నకయూటాడి మ్రింగు నొకడు
ఒక్కఁడాకొని గోళ్ళనాలచినట్టి చివుళ్ళ బుక్కిళ్ళకొలదిగా బొక్కు నొకడు
తే. తరువుపైనుండి తరువుపైదాటునొకడు పండ్లకెటుకంటిమ్రాకైన బ్రాకునొకడు
దిగువగూర్చుండి తరువున కెగురునొకడు పెద్దపాదువునందుండు కుప్పించునొకడు

ఉ. గాయలవ్రేటులాడుచును గంతులువైచుచు బూవుదీవలం
దూయలలూగుచు న్దరువులూపుచు నొండ్లనుబొట్టఁగొండగా
మేయుచు వెక్కిరించుచు మిన్నక దాటుచు దోకలెత్తుచున్
గూయుచు నేలదూకుచు గుంపులుగూడి కపీంద్రులెంతయున్ 235

క. వనమంత గాసిచేయగ వనపాలకులేగుదెంచి వడిగోపముతో
డను నదలించినవారల హనుమంతుడు మొదలుగాగ నగచరులెల్లన్ 236

క. మెడబట్టి వనములోపల వెడలగ నటు పాఱద్రొబ్బి వెడలుండన్నన్
దడయక దధిముఖుడనుతమ యొడయనికడకేగి వారలుగ్రముగాగన్ 237

వ. విన్నవించినయంత నే 238

చ. దధిముఖుడప్పుడుండిపడి తా దనవారల గూడివచ్చి బ
ల్వ్యధముల సంచరించు కపివీరుల గోపముతో డజూచి యా

మధువన మెల్ల గొల్లగొన మర్కటవల్లభు వాజ్ఞ దోఁపియుఁ గం
న్నష్టముల జేయు నెంతయు నుతులంచును బాలుఁ వారనుద్ధతిన్ 238

వ. ఇట్లుల దండింపుచున్న దధిముఖుండై నంగదాది వనచరులం గడిసి సుగ్రీవుం గాంచె. 239

క. కొందఱ దరచియుఁ బొడిచియుఁ గొందఱ దలపట్టియీడ్చి కొట్టియుఁ గోళ్ళన్
గొందఱ వ్రచ్చియు ద్రొబ్బియు నందఱ నొప్పించువారలాగ్రహవృత్తిన్ 240

క. క్రియ్యలు వారగవ్రచ్చిన గ్రొయ్యలు రక్తములు గ్రమ్ముగా వడితోడన్
సుయ్యో మొఱ్ఱో యని వార య్యెడ సుగ్రీవునకు నెఱిగించిరతిన్ 241

వ. అరిగి రామలక్ష్మణులం గూడియున్న మిహిరనందనుం గనుంగొని నమస్కరించి మధువనంబునందు జరిగినవృత్తాంతంబంతయు విన్నవించినవారల నాదరించి సుగ్రీవుం డిట్లనియె. 242

క. దేవా పంపున జని వారెవ్వరున సీత గనిరో యటు గాకున్నన్
నావనము పాడు సేయరు పావని మొదలైనవారు భయవిరహితులై 243

వ. అని రామసౌమిత్రులకుం జెప్పు వినయుండగు సుగ్రీవుండు వారలనూరార్చి రామునకుం గేయుండుం గాని వారలందోడ్కొని యతివేగమె రండని యంపినం జని యంగద హనుమంతులం గని యవనీశ్వరుం డీక్షణంబున మిమ్ముం గొంపోవ నచ్చుటికి రండని యానతిచ్చెం గావున వేంచేయ బయుండని తోడ్కొని పోవునప్పుడు వారల కెదురుగా వానరవీరుల గొందఱ ననిపిన వారలం గూడి చనుదెంచి శ్రీరామచంద్రు పాదారవిందమ్ములకు సాష్టాంగదండప్రణామమ్ము లాచరించి సౌమిత్రికి వందనమ్ము లొనరించి సుగ్రీవునకు నమస్కరించి తనచేత మేలువార్త వినం నుత్సహింపుచున్న రఘువంశేశ్వరుల దలంపెఱింగి హనుమంతుం డిట్లనియె 244

శా. కంటిన్ జానకిఁ బూర్ణచంద్రవదనన్ గల్యాణి నాలంకలోఁ
గంటిన్ మీపదపంకజంబులను నే గౌతూహలంబొప్పగా
గంటిన్ మీకరుణావలోకనము విఖ్యాతంబుగా గీర్తులన్
గంటిన్ మాకపివీరబృందములలో గాంభీర్యవారాన్నిధీ 245

సీ. కట్టినవస్త్రంబు కట్టుకొంగే తక్క జీర్ణించిపోయిన చీరతోడ
నుడుగనివలలచే నోరంత పొద్దును జెక్కుటంజేర్చిన చేయితోడ
బుడమిపైఁ బొరలాడు నొడలు బూడిదఁ బ్రుంగి నిరతంబు దొరఁగు కన్నీటితోడ
నిడుపెన్నెఱివేణి సడలించి జడలతో నిరతవిరహపరనియతితోడ

గీ. గినుక గంజంకించు రక్కసకామినుల నడుమ దపము జేయుచు దనుకబాధలను వోర్చి
వనితప్రాణంబు దక్క సర్వము త్యజించి నిత్యము మిమ్ము మదిలోన నిల్పియుండు

క. జానకిబోడగని యును మీ రానతి నాకిచ్చి పంపినట్టివిధంబునకా
నే నాయను కెఱింగించియు జానకిరత్నంబుగొంచు జనుదేగంటికా 247

వ. ఇవ్విధంబున సీత వృత్తాంతంబులు రామచంద్రునకుంజెప్పి దండప్రణామంబు లాచరించి తను సీతామహాదేవిదయచేసిన శిరోరత్నంబు శ్రీరామచంద్రునకు సమర్పించిన జూచి యదియంత్యంతసంతర్పి యానందబాష్పంబులు గ్రిమ్మదేర మూర్ఛిల్లి తెప్పరిలి హా! రాజలోచనా! హా! పద్మగంధీ! హా! సీతా! హా! సీతా! యనుచు శోకించి సుగ్రీవుం జూచి మనము లంకాప్రయాణము చేయబోవుదము గాన సకల సేనలం గూర్చుము యూనతిచ్చిన వానరేశ్వరుండు మహాప్రసాదం బని యంగద హనుమజ్జాంబవత్సు సేన పనసనల నీల గజగవాక్ష గోముఖాదులను సేనానాయకుల నరుపదికోట్ల నియోగించిన వారును నాల్గొక్కరు నూరేసి కోట్లబలంబు తోడ రామచంద్రుని యిరువంకల నాడుచు బాడుచు మాల్యవంతంబు వెడలిరని విని నారదుని వాల్మీకిమహామునీశ్వరుండు మటుమీదివృత్తాంతం బెట్టిదని యడుగుటయు

క. జలజాక్షు! భక్తవత్సల! జలజాసనవినుతపాదజలజాత! సుధా.
జలరాశిభవ్యమందిర! జలజాకర చాపహంస! జానకినాథా.

గద్యము. ఇది శ్రీగౌరీశ్వర వరప్రసాద లబ్ధగురులింగ జంగమార్చనవినోద
నిత్యశైవాచార సంపన్న కులాజనవినుతాతకూరి కేశనశెట్టి
తనయ మొల్లనామధేయ విరచితంబైన శ్రీరామాయణ
మహాకావ్యంబునం దారణ్యకాండము
సర్వము నేకాశ్వాసము.





శ్రీరస్తు.

# మొల్ల రామాయణము.



## యుద్ధకాండము - ప్రథమాశ్వాసము.






కామారివినుతనామా!
సామీరికృతప్రణామ సంహృతరక్షో
గ్రామా! వర్షామేఘ
శ్యామా! సంగ్రామభీమ! జానకిరామా!

వ. శ్రీనారదమహామునీశ్వరుండు వాల్మీకిమునీశ్వరున కెఱింగించిన తెఱంగు వినుపించెద సావధానచిత్తంబుతో నాకర్ణింపు మటుల శ్రీరామచంద్రుండు వానరసైన్యముతో వెడలి నడచుచుండ హనుమంతుం డంతకుమున్ను తాను లంక కరిగి మగిడివచ్చి యచ్చటి వృత్తాంతమంతయు శ్రీరామచంద్రున కెఱింగించియు ద్రోవలో నుబుసుపోకకుగా మరల రావణుండుండు చందంబును రాక్షసస్త్రీల సంవాదంబును నింద్రజిదతికాయాది కుమారవర్గంబు తెఱంగున కుంభకర్ణ విభీషణాది సోదరుల యునికియును లంకిణిపోంకం బణంచుటయు లంకలోపల బోయిన చందంబున లంకాపురీదహనంబును సముద్రలంఘనంబును నదియిదియననేల తా జేసివచ్చిన కార్యంబులనెల్ల దెవరెవ్వ రేదియడిగిన వారి కావృత్తాంతంబు నెఱింగించుచుండ మిగిలినకపులు వినుచు దమజాతిచేష్టలు చూపుచు జనుచున్న చందంబును సుగ్రీవుండు రామచంద్రునకు చూపుచు నడచుచున్న సమయంబున 2

ఉ. కొందరు మంతనమ్ములనుకొంచును గొందరు దొమ్ములాడుచుం
గొందరు రామలక్ష్మణులకుం బ్రియవాక్సతి నాటలాడుచుం
గంతులువేయుచును గొందరు పండ్లిగిలించి చూపుచుం గొందరు
గొందరుబోవుచుండిరి దయానిధి రాముడు సంతసిల్లగన్ 3

సీ. పాదఘట్టనలచే బగిలిన కొండరాళ్ళ నాకసమ్మున మేఘమట్లు పర్వ
వీకతో దాకినవృక్షజాతంబెల్ల వేళ్ళూడి కొమ్మలు విరిగిపడగ
బలువడితో బోవు పక్షిజాతమ్ములు భయముచే నందంద పాఱుచుండ
చూపించి రావణాసురుని సైన్యంబిట్లు మనవారిచేతను మ్రందగలదు

గీ. అనుచు శ్రీరామునకు మర్కటేనయుఁడిట్లు సంతసముప్పుట్ట జెప్పుచు సాగిసాగి
క్రమముగా నందఱును గొంతకాలమునకు దిన్నగాఁ జేరిరి సముద్రతీరమునకు 4

వ. ఇటులందరును సముద్రతీరమున విడసియున్న సమయంబున హనుమంతుండు బుద్ధిమద్వ
రిష్ఠుండు గావున శ్రీరామచంద్రునకు నమస్కరించి రావణుండు రాజ్యంబునం బట్టి
భద్రుండై యున్నవాఁడు వానిం జంపి సీతామహాదేవిం దెప్పించుపనికై వేగమన
మందఱమును సిద్ధులమై యుండవలయు ననవుడు రామచంద్రుండు తమ్మునితో 5

క. ఈవానరులను దోడ్కొని ప్రావీణ్యముతోడ వృక్షపర్వతతతులన్
వేవేగ మె తెప్పింపుము పోవుదమటుమీద వైరిపురముం జేరన్

వ. అని యిటులానతిచ్చి సముద్రతరణోపాయం బాలోచించుచుండె నంత 6

సీ. అక్కడ రావణుం డఖిలమంత్రుల వేగ రావించి తగను వారలకు నిట్లు
మంత్రిసత్తములార! మర్కటుం డొకఁడేగుదెంచి మనందఱం గొంచెపఱచి
రాక్షసవీరుల రణభూమి బొలియించి వనమంత చెఱిచి వార్ధిదాటి
పోయెను బోరాని పోకలబోవును వాఁడు శ్రీరాముని వద్దకేగి

గీ. ఏమి చెప్పునో యామీద నామనుష్యు లిద్దరును వానరులగూడి యేపుమీఱ
వచ్చి లంకాపురములోని వారినెల్ల నేమొనర్తురో యిపుడు నాకేమి దాటి 8

వ. అని యిటుల రావణుండు నిండుపేరోలగంబున గూర్చుండి డోలాయమానసుండై విచా
రించుచుండ నా సమయంబున విభీషణుండు సాయంసంధ్యావిధిం దీర్చుకొని తన
మంత్రులుం దానును గొల్వుకూటంబునకేతెంచి పెద్దగద్దెపైఁ గొలువున్న దనయన్నకు
సాష్టాంగదండప్రణామంబు లాచరించిన నతండును సంతోషించి యనుజునకు సువర్ణ
పీఠంబు జూపిన నాసీనుండై యన్నకిటులనియె 9

గీ. అవధరింపుమా దేవ మహానుభావ మనపురమ్మున బ్రకృతమ్ము చను తెఱంగు
విన్నవించెద నున్నదియున్నయట్లు గొంచమవధానముగ నాలకించుమయ్య 10

సీ. అన్నంబు నీరును సక్కఁగ లేకుండ భటులందరును దుఃఖపడుచుండిరయ్య
కంబాలఁగట్టిన గజబృంద మెల్లను జవసత్వములుదూలి జడిసెనయ్య
హాగ్గంబుతోడుత హయజాతమంతయు మెడలెత్తుకొని వేడ్కమెలగవయ్య
ప్రజ్వలించుచునున్న ప్రతిహోమకుండంబు బొగలు గ్రమ్ముచు నాఱిపోవునయ్య

గీ. ఇట్టియపశకునముల గన్పట్టుమయ్య సకలశాస్త్రంబు లెఱిగినజాణవయ్య
యింపుగాఁ జెప్పుచుంటి నాలింపుమయ్య వేగ రామునిసతి నిచ్చివేయుమయ్య 11

క. సీతను దెచ్చుట మొదలుగ నీతో నయవాక్యములను నే జెప్పితి నీ
చేతనమున బెట్టవైతివి ఖ్యాతిగ నిక నైన సీత నాతనికిమ్మా 12

వ. అదియునుంగాక మొన్న రాత్రి సీతయొద్ద గావలియున్న రాక్షసకాంత లందరును నిద్రించుచున్న సమయంబున త్రిజట దిగ్గున మేల్కాంచి నిదురించుచున్న స్త్రీల నులేపి చెప్పిన దుస్స్వప్నంబు విన్నవించెద నాకర్ణింపుము రామచంద్రుఁడు మన లంకపైఁ దండువిడిసినట్లును నీవును కుంభకర్ణుండును దక్షిణాభిముఖులై గార్దభంబుల నెక్కి పితృభూమి కరుగుచున్నట్లును నింద్రజిదాదికుమార వర్గంబును సైన్యంబును మూలబలంబును సర్వంబును నశించిపోవుచున్నట్లును సీతం జేకొని శ్రీరామచంద్రు డయోధ్యకు బోవుచున్నట్లును గలగన్నదట త్రిజటకల నిక్కంబై తోఁచెడిని రాముడు వానరసైన్యంబుతోఁ గూడి సముద్రతీరంబునకు వచ్చియున్నాడని చారులువిన్నవించిరి. ఆరామునిదూత యు మరల నిచ్చటకు రాకమునుపే శ్రీరామచంద్రునకు సబహుమానంబుగా సీత నర్పించుటయే లెస్స కార్యము ఇంత చెప్పనేల మొన్న నాకు దూతవానరవేషంబున వచ్చి తనప్రాక్రమంబున నీవనపరివారమునకును నెరింగించి పోయె నది గురుతుంచుకొమ్ము అనియిటులు నీతిచెప్పు తమ్మునిపై గోపించి దిగ్గన కొలువుకూటంబు విడిచి యంతఃపురంబునకుబోయె నాసమయంబున నాసభలోని వారందరును దమతమమందిరంబుల కరిగిరి 13

క. మరునా డెప్పటియటులనె సురుచిరముగ గొలువు సేయఁ జోద్యంబుగ ని
ద్దురఁ బోవుకుంభకర్ణుండు సరిగా మేలుకొని వచ్చె సరభసలీలన్ 14

వ. ఇటుల గృహప్రవేశంబుఁ జేసి స్నానాదిక్రియలు నిర్వర్తించుకొని భుజియించి మంత్రులతో నన్నకొలువునకు జనుచుండు కుంభకర్ణునితో మరల విభీషణుండును మంత్రిసహితుండై వచ్చెను అనుజులిద్దరును వచ్చి నమస్కరించిన దీవించి క్షేమం బడిగి యుచితాసనంబులం గూర్చుండ నియోగించిన కుంభకర్ణుం డత్యంతము నాసన్నుండై కూర్చుండెను కొంచెము దూరములో గూర్చుండియున్న విభీషణుండు మరల నన్నతో నిటులనియె. 15

సీ. దశరథరాముడు తనపత్ని గోల్పోయి వానరావళి గూడి వచ్చి యుప్పు
డదె మాడు నంభోధి యావలి యొడ్డున గపిబలంబులతోడఁ గలసియుండె
రామునిసత్వంబు రమణిచే మున్వింటి మతలితమ్ముండును నట్టిడంట
సారథి వారికి బ్రాపు సుగ్రీవుఁ డున్నాడు వాయుతనూజుం డుంచినవానితమ్ము

గీ. డాత డిటు వచ్చి నను సుగ్గాడి కాని సీత దేనని పంతంబు చేసెనంట
వలదు వైరంబు సీతనీవలయు వేగ నతని నని గెల్వగా జాలరమరవరులు 16

గీ. రాము గెలువంగవచ్చునే రాజసమున సీత నర్పించి తత్పాదాబ్జాతములకు
నర్థిఁ బ్రణమిల్లి శరణన్న నతడె రాముసత్యసంధుఁడు సత్కృపాసాంద్రుఁ డతడు.

గీ. చంపవచ్చినట్టి శతృవు పైనను శరణుచొచ్చునంత సరయుడగుచు
నభయమిచ్చి కాచుటాతనిబిరుదంట సీతనిచ్చి రామునేరవ్రితకు 19

వ. అనిన విని యారావణుండు కటకటంబడి విభీషణునితో రోషభీషణంబుగా నిటులనియె.

గీ. నీవు నాదాయతో నీచబుద్ధి! బుద్ధి సెప్పెదు నాకు దమ్ముడవె నీవు
కడగి నీమంత్రులును నీవు గంటిలోని సెరసు సరవింనున్నారు నిశ్చయముగ 20

గీ. నాకు దమ్ముడవయ్యు నవార్యముగ నాదుశతృలబాగడుచు నాకు బుద్ధి
సెప్పవచ్చితి వౌరౌర సిగ్గులేక యిచ్చవర్తింపుమండు టిదేమిపనిర.

వ. అనిన విభీషణుం డన్న కిటులనియె 21

తే. నిన్ను జంపంగదలపోసి నీదుమంత్రి వరులు గాచుచునున్నారు వలదు గోత్రి
కలహ మీ చెడుబుద్ధి రేకరణినైనన్న! యింకొక్కకోనమాటయాలకించు. 22

వ. రామచంద్రుం డాదినారాయణుండు సీత యాదిలక్ష్మి, వానరబలంబు బృందారక సందోహంబు గావున నీ వారామచంద్రుని కెదిరి జయంబుగొనుట కడింది కార్యంబు నే జెప్పినబుద్ధి వినివేగ నారాముని శరను దొరుము సుఖంబుగ మనుము అని విన్నవించు నహితవచనంబులు రోగికిబద్ధ్యాహారంబు రుచింపని పోలికనవీనుల కసహ్యంబులై యుండ రావణుడు మండిపడి యిట్లనియె 24

సీ. పటువిషంబాలికించు పాములతోనైన జెలగియుంపుగ జెల్మి సేయవచ్చు
గానిశతృలసెప్పు గైవారములు సేయువానిని దనవారిణబంధునైన
జేరదీసినయేని జేటువాటిల్లునుగావున వీనిఖల్గర్వ మణంతు
వినుకుంభకర్ణ నీవును రాకమునుపు నీ చెడుగునాకునుబుద్ధి సెప్పబూనె

గీ. ననుచు హుంకరించి యవ్విభీషణుబట్టి వేగగ త్రిబూని వేసియబోవ
నట ప్రహస్తుడప్పు డడ్డంబుగ్గ గావచ్చి దేవనీకుదగునే యీవిధంబు 25

క. నీకేల యింతకోపము నీకు హితశుల జెప్పుచున్న నీతమ్ముని నీ 26
వేకత్తి వ్రేసిచంపిన లోకంబు నిను మెత్తురయ్య లోకస్తుత్యా

గీ. గుణయుతుండైన మనవిభీష ణుండు లేనిలంక యేటికిమనసైన్యంబులింక నేల
వైభవంబేల యామీదపాణమేల శాంతమవధారు దేవనీస్వాంతమందు

వ. అప్రహస్తుండు రావణుకోపంబును గొంతశాంతపరిచె నప్పుడన్న కోపంబునకు తమ్ముడు కుంభకర్ణుండు వడవడ వడకి యన్న కెదురాడ నోపక తమ్మునిగాదన లేక గద్దియమీద గూర్చుండియున్న యన్నకు మ్రొక్కి నిదురగృహంబునకుం జనియె నట విభీషణుం డన్నంజూచి యోరీ నీవు విశ్వాసఘాతుకుండవు స్వామి

ద్రోహివి గావున నీవు నాకొక్క పేదరుని బిడ్డజేసి చెప్పెద నాత డెట్టిపోయ
వశాలియేని నీవాతనిం జేరి సుఖంబున బ్రతుకుమనిన నతం డిట్టులనియె 28

సీ. విన రాక్షసేశ్వర విష్ణుసన్నిభుడు రాముకడు వా! పేదరుండె నీకు
నతని సత్యస్థితి యతనిపరాక్రమ బిపుడు నీ కెరుగగ జెప్పలగును
అవనీసుబాణంబు లతిరయంబున వచ్చి దండించునపు డైన దలచు నన్ను
పర్వతశిఖరముల్ పడినట్టుల నీతల లిలగూలునపుడయిన దలచు నన్ను
గీ. నీకు తమ్ముడ నాటనే నీపుబ్రతుకు కొఱకు జెప్పిన నీకింత కోపమేల
వినుము నామాట సీత నర్పించి యతని శరణు వేడుము వలదు నీ సాహసమ్ము 29

వ. అని చెప్పిన హితవచనంబులకు మరింత కోపోద్దీపిత మానసుండై యాజ్యాహుతిం బ్ర
జ్వరిల్లిన హుతాశనుగతి మండిపడి వెడలవెళ్ళవార్చి గద్దియ మీద గూర్చున్న విభీష
ణవక్షంబు పగులందన్నిన నతండు తనకన్నులనుండి దొరగు జలకణంబులు హస్తం
బులం దుడిచికొనుచు నాక్షణంబున మంత్రులుం దానును దనతల్లియైన కైకసి
యొద్దకుం జని సాష్టాంగదండప్రణామం బాచరించి యన్న చేసిన దుర్నయంబెఱి
గించి శరణాగతవత్సలుండైన శ్రీరామచంద్రుని సన్నిధానంబునకు బోవుచున్నాడ
నని చెప్పి యాయమ్మ యనుమతంబు వడసి దీవనలు గైకొని చని సముద్రతీరంబున
విచారగ్రస్తుడై యున్న శ్రీరామచంద్రుం గని విభీషణుండు 30

సీ. భానుకులోత్తంశ వందితామరలోక జానకీనాయక శరణుశరణు
తాటకాప్రాణవిదారణ రఘురామ సకలలోకాధార శరణుశరణు
దిక్కు నీవని వచ్చితిని దీనమందార పరమపూరుష రామ శరణుశరణు
మాతృపితాదులమాడ్కి సంరక్షించు సర్వలోకస్తుత్య శరణు శరణు
గీ. రామ వెఱచి నాడ రక్షించు రక్షించు మిపుడు నాకు నభయమిమ్ము యిమ్ము
చూడు చూడు నిన్ను జొచ్చితి శరమ్ము కావు కావు నన్ను గరుణతోడ. 31

వ. అని యివ్విధంబున రామచంద్రుని స్తుతి సేయుచు జేరవచ్చుతరిని సుగ్రీవుండు శ్రీ
రామచంద్రునిం గని విశ్వాసంబు జూపువాడై దేవా వీడు రావణునితమ్ముండు
విభీషణుండనువాడు రాక్షసులు మాయలు చేయుదురు గాన వీనివధియింప నాజ్ఞ
నొసంగు మనిన రామచంద్రుం డందులకు సమ్మతింపక యితం డెవ్వడైన నేమి
శరణన్న రావణుని తమ్ముని నేకాదు రావణుడైనను గాచెద శరణని వచ్చిన వాని
ప్రాణంబులు కాపాడుట రాజులకు బరమధర్మము తొల్లి శిబిచక్రవర్తి రాజ్యంబు
సేయుచుండ నొక్క ఖగంబు వేతెంచి శరణుచొచ్చిన నభయం బిచ్చి తన దేహముం గోసి
దానిం దరుముకొని వచ్చిన డేగ కిచ్చెనట కావున నాతని నాయొద్దకు గొనిరమ్మన

వుడు సుగ్రీవుండు విభీషణుని దోడ్కొని తెచ్చి శ్రీరామచంద్రుని పాదారవిందము లపై బడవైవ నతండు విభీషణు నెత్తి యాలింగనము చేసి యథోచితప్రకారం బొసంగి నేడు మొదలు నీవు మాకు హితుండవు బాంధవుండవు నయితివి గావున నిన్ను మాతమ్ములలో నొకనిగా జూచికొనియెద నని నమ్మబలికె విభీషణా! యింక వైరి ప్రభావంబు జెప్పు మనిన దశరథనందనునకు వందనంబాచరించి కరయుగంబు శిరంబున ధరియించి యతం డిటులనియె 32

క. రావణబల సత్త్వస్థితి యావిధ మనిశౌర్యసహిమ యభినుతి సేయన్
నావశము గాదత డల దేవేంద్రుని వెట్టి గొనుచు దనరు నరేంద్రా 33

క. ఒక్కొక్క గగనివాకిట నొక్కొక్కయే మూడు కోట్లు నుండును దైత్యుల్
నెక్కర గావలియుంచును దక్కక మతి యెల్లకడల దానును దిరుగున్. 34

వ. తన పరమావర్గము లక్షయు నేబదివేలు వారల కొక్కొక్కరికి లక్షమంది బంట్ల నేర్పరచి యుంచిన వారు లంకవీధులలో గొందరును నగరుచుట్టును గొందరును మఱికొన్ని చోటుల మఱికొందరును గుంపుగూడి తిరుగుచుందురు అయినను బ్రహ్మాదులకైనను సాధింపనలవు పడని లంకాపట్నము మీచేత సాధింపబడగలదు గావున మీరు వేవేగ సముద్రునిం బ్రార్థించి సముద్రబంధనంబు సేయవలయు ననిన నంత మహేంద్రపర్వతంబు డిగ్గి సముద్రప్రాంతంబున విడిసి జాంబవదంగదను నీల మైందాది వనచరవీరులచేత నలుదిక్కులయందుంగల పర్వతంబులును వృక్షంబులును బాషాణంబులును దెప్పించి కడలి కట్టం గడకగిన 35

శా. కూపారుండును సంతసిల్లి జలజాతుం జూచి యెన్నండి స
ల్లాపం బుద్ధతిం బొంగ జూచి వికసోల్లాసంబునన్ రాఘవ
క్ష్మాపాలుండును గోపయుంగ దుర గర్వంబు నాచేత న
మ్మైపో నిప్పు డటంచు లక్ష్మణునకు విల్లందియ్య నెక్కొకతోన్ 36

మ. పరమప్రోద్యత్కుటిలాకృతిన్ బొమలు చూపట్టంగ శోణప్రభో
త్కటరేఖల్గనుగొల్కులన్ని గుడ గోదండంబు సారించి భూ
వరవంశాగ్రణి రాము డద్భుతముగా వారాశిమీదన్ వడిన్
శరజాలంబులు పేర్చివేయుటకు నిచ్చన్ బ్రాణభీతిన్ వడిన్ 37

క. రామునియెదుట సముద్రుడు తా మానవరూపు దాల్చి దైన్యము దోపన్
రామునకు మ్రొక్కియపుడా ధీమంతుని కనియె నిలని తేజం బెసగన్ 38

ఆ. ఇంక నేల తడయ నీ కులాధీశ్వర కపుల బంపి వేగ గట్టుమయ్య
కట్టు గట్టిదాటు కమలాప్తకులచంద్ర కీర్తి లోకమున నెగడు గాగ. 39

వ. మిమ్ము గను దరిసించుటకు మన్నంటఁ బొంగితి నింతయుఁ గాని కపటోపాయంబున
బొంగినవాఁడను గావనిన రామభద్రుండును కరుణాసముద్రుండు గావున సముద్రు
నెప్పటియట్లయుండ నియమించి వానరులం బనిచిన 40

క. రాముని పంపున బ్లవగ, స్తోమం బట్లుగిరి యరిగి దొడ్డగు కొండల్
క్షేమమున దెచ్చి జలనిధి, రామాజ్ఞను వైచి రధికరభసం బొప్పన్ 41

వ. ఇట్లు వానరవీరులు పర్వతపాషాణవృక్షజాతంబులు లక్షోపలక్షలుగా దెచ్చి వారా
శింబడ వైచి శబ్దభగుద్వానంబుల నుప్పొంగుచు బ్రహ్మాండభాండంబు బ్రద్ద
లగునట్లుగా నార్చుచు నట్టహాసంబులు సేయుచు గంతులు వైచుచు వెక్కిరింపుచు
బరువు లెత్తుచు నున్న దెచ్చివైచిన పర్వతాదుల నెల్లది మితిమింగిలములు మ్రింగ
జాసమయంబున. 42

ఆ. తిరుగ దెచ్చి వైవఁ దేలి రాకుండుట, నాత్మలోన సంశయంబు నొంది
రాజసింహుఁ డపుడు రత్నాకరుని జూచి, యనుగుటయును వేగ నాతఁ డనియె

సీ. రావణుపంపున రాలెల్ల జేపలు మ్రింగుచుండెఁగదయ్య మేదినీశ
తిమితిమింగిలములు దిరుగుచు నాయందు, నుండి రావణుపంపు నొనరఁ జేయు
నలుఁడు కట్టినఁ గాని నిలువ జేరదు కట్ట నలుని బంపఁగదయ్య నళిన నేత్ర
యని సంతృప్తి సెప్పి యవ్వేళ నరిగిన, వీరు లిచ్చట మహావీర్యమునను.

గీ. పర్వతంబులు తేలగా భానుకులుని, పంపుచేతను వారధిబరగ వేగ
నలుఁడు నాపాద్రి దపది యోజనములు గట్టె, నంతలో సూర్యుడస్తాద్రి కరుగుచుండె

వ. అంతనా రాత్రి యస్తమయం బగుటయును వానరేంద్రులు తమబలంబులం గూడి వేగు
నంతదాక సేతుబంధనమునకు గాపుండి రంత సూర్యోదయం బయినవెంటనే
మహాబలశాలియగు హనుమంతుండు సువేలాద్రి కరిగి యోవనంబు హొంకనున్న
హేమకూటంబును నాగపర్వతంబును సింహాచలంబు ననుమూడుకొండలు వాలి
పాశంబునం బెకలించి నిమ్మపండ్ల మాడ్కి బూలబంతుల పంతున నెగరవైచుచు
నే తెంచి నలుని కందిచ్చిన నాపర్వతంబులు మూడును దొంబది యోజనంబులు
నిడుపుగల్గియుండ నివ్విధంబున శతయోజనములు నిడుపు నుదశయోజనంబులు వెడల్పు
నుగా నీరధిని బంధించి నలుండా వార్త రామున కెఱింగించిన తోడనే యతండు
లంక లగ్గలబెట్ట నుద్యోగించి పనసునుత్తరపుగవను జాంబవంతుబడమటిగవను
గవయు గక్షిణపుగవను హనుమంతు దూరుపుగవలను బట్టనియమించిన వారలును
లంకాపురంబు లగ్గలకుం జొచ్చి రాక్షసుల నుగ్గునూచంబు గావించుచుండ హత శేషు
లు పరుగెత్తి యా వింతయంతయు రావణునకెఱింగించి నతండు చింతాక్రాంతుఁడై

దేవాంతక నరాంతకాతికాయ త్రిశిరో మహోదర మహాపార్శ్వాదుల రామలక్ష్మణులజంపి వారిశిరంబులు గొనిరండని పనుప వారరుగుదెంచి ఘోరాహవంబునం దమ శిరంబులు రామలక్ష్మణుల బాణంబుల కర్పించిన వారిలో జావక మిగిలిన యతికాయుం డరుదెంచి తండ్రియగు రావణున కిట్లనియె 45

శా. దేవా భానుకులావతంసుఁడు మహాధీరుండు రాముండు బా
హావిర్భూతమహాప్రతాపమున దైత్యవ్రాతముల్ భూరివీ
రావేశంబున ద్రుంచెబో మనమునం దాశ్చర్యమున్ భీతియున్
దోఁపన్ వేఱ వచింపనేల యిక దుర్ఘోరప్రతాపోన్నతల్ 46

వ. అని యతికాయుండు విన్నవించిన నుల్కిపడి కుంభకర్ణుని మేల్కొలుపం బనిచిన నట్టి యనుజుం జూచి దశముఖుం డిట్లు లనియె 47

క. అనిలో నీ వా రాముని ననుపమబలశాలియైన యనిలతనూజిన్
ఘను డగు లక్ష్మణు గూల్చి విను వారలతలలు గొంచు వేగరమ్మా 48

వ. అని యనిపిన. 49

సీ. భేరీమృదంగాది భీమవాద్యధ్వాన ములను సముద్రముల్ పొంగి పొరల
గపులపాలికి లయకాలుఁడో యచును వినువీధి దివిజులు వెఱచి తొలఁగ
నతికాయుఁడును మహాహంకారమున వేగ వెనువెంట గోష ప్రవృత్తి జనఁగ
కుంభకర్ణుండు కాకుత్స్థుపై బోయిన దక్షిణోత్తరసముద్రములరీతి

గీ. కదిసి యిరువురు బోరాడ గడగుచుండఁ గపులు వేవేగ వచ్చిరి విపులశక్తి
నాథసురగంధర్వపతులెల్ల సరభసమున జూచుచుండఁగ బోరిరి సురుచిరముగ 50

వ. ఇట్లు పెద్దయుం బ్రొద్దు వీరావేశంబున బోరుచుండ కుంభకర్ణుండు విజృంభించి బలంబుల కుతికి దిగ్గజకర్ణపుటస్ఫోటితంబుగా నార్చుచు వానరవీరుల నసంఖ్యంబుగా మ్రింగుచుండం గడంగిన రఘువీరుం డలిగి బ్రహ్మాస్త్రంబు ప్రయోగించినవాని శిరంబును దునుమాడె నంత నతికాయుండు తన పినతండ్రిపాటునకలిగి రాఘవేంద్రుని కభిముఖంబుగా నిలిచి దివ్యాస్త్రంబులు ప్రయోగించుచుండ లక్ష్మణుం డడ్డువచ్చి నానాస్త్రంబులు బ్రయోగించి ఘోరంబుగా యుద్ధంబు చేసి కడపట వారుణాస్త్రంబు వింట సంధించి విడిచిన నది యతికాయుశిరంబు ద్రుంచె నంత హతశేషులైన రాక్షసులు కాందిశీకులయి రావణుం జేరి 51

గీ. దేవ దేవాంతకుఁడు సచ్చె దీనవృత్తి, కుంభకర్ణుఁడు సమసెను ఘోరలీల
దెగువ నతికాయుఁడును మ్రగ్గె దీనికింక, బూని ప్రతికార మొనరింపు భూరితేజ

వ. వినుము వాయునందనా! యీలవణసముద్రంబునకు దాటి హిమవంతంబును నిషధా
చలంబును గడచి మేరుశైలంబును డాసి కైలాసంబు శ్వేతపర్వతంబును నతిక్రమించి
ఘృతసాగరంబు లంఘించి ద్రోణగిరిపర్వతంబునం దున్న యౌషధశిఖరంబునం గల
సంజీవకరణ్యాదిదివ్యౌషధంబులు గొనివచ్చి రాఘవప్రీతిగా సైన్యంబుల ప్రాణంబులు
నిలిపికీర్తి వడయుమని ప్రార్థించిన నయ్యకొని వాయునందనుండు వాయువేగమనో
వేగంబులం జని జాంబవంతుండు చెప్పిన దివ్యౌషధాచలంబునె కొనివచ్చి సకలసై
న్యంబుల ప్రాణంబులు గాచి నిమేషమాత్రంబున నక్కొండ తొల్లింటియునికిఁ బెట్టు
నని నెలకొల్పివచ్చునప్పుడు. 65

క. ఇను డుదయపర్వతంబున గనుపట్టిన దెల్లవారె గపిసైన్యములున్
జననాథు గాంచి మ్రొక్కిరి జనపతియును వాయుసుతుని సంశ్లాఘించెన్ 66

వ. అంత నింద్రజిత్తు రాక్షసమంత్రుల కొసంగి చెప్పించి విజయంబు నుల్లయును దెలియుటకు
గానున దనుప జాయ లేచెం యుత్సాహంబుతో యుద్ధసన్నద్ధులై కెరలుచున్న
వానరబలంబులం గనుంగొని మరలి చనుదెంచి రామచంద్రుని బలంబున్న తెఱం
గెఱింగించిరి అదివిని కలంగియు గలంగని భంగిని నాశ్చర్యంబు నొంది రామలక్ష్మ
ణులపైకి గుంభనికుంభగవాక్షప్రజంఘ శోణితాక్షులం బంపిన వారును జతురంగ
బలంబులతోడం గరి తురగ రథారూఢులై వెడలి సింహనాదంబులు సేయుచు
వానరసైన్యంబులపై గని శరవర్షంబు గురియుచు బరిఘలం జక్కు సేయుచు నడి
దంబుల వేయుచు ముద్గరంబులం జెండుచు ముసలంబుల మోదుచు గదలచే
మట్టించుచు తురంగములచే ద్రొక్కింపుచు రథంబులం ద్రోలి తెంపరలాడుచు
మహాహవంబు సేయుసమయంబున గపిబలంబు లదరి గిరివర్గంబులు దరువర్గంబులు
ను లక్ష్మణంబుగ గైకొని ప్రతిఘటించి పోరాడునప్పుడు 67

క. తెంపున వాలిసుతుండు కంపను డను దైత్యుగని కోపమునన్
జంపింపబట్టి వానిని జంపెను వక్షంబు పొడిచి సాహసవృత్తిన్ 68

వ. అప్పుడు.

చ. కనుగొని శోణితాక్షుండు సకంపనుప్రాణము గొన్న వాలినం
దనునిపయిం గడుం గినిసి తాఁ ద్రొక్కి తాకి రథంబు ద్రోలినన్
గనలుచు నంగదుండు తురంగంబులతోన తురథంబు సుగ్గగా
దనుజునిమీద దాసరికి దన్నినవాఁడును గూలె నేలపైన్

ఆ. అతడు నేలగూల నాప్రజంఘుండును ఘనుడు యూపకేతుండెనసి వాలి
కొడుకుమీద దాగ గోపించి మైందుడు! ద్వివిదుండు తలోని తెంపుమిగిలి 71

క. దనుజుల దోల బ్రజంఘుడు కనుఁగొని యవ్వాలి సుతునికటములు పొడుచన్
గనలి నిశాచరుశిరమును ఘనతరదృఢముష్టిఁబొడిచి గడపెన్ ధరకున్

సీ. ఘనుఁడు ప్రజంఘుండు కదనంబులోఁబడ్డ నక్షయబలుఁడు యూపాక్షుఁడంత
గదగొని వేసిన ఘనతతో గుప్పించి భుజశక్తి నాతని బొదివి పట్టి
కొనిపోవునప్పుడు కోపించి యన్నకై శోణితాక్షుఁడు వచ్చి శూరుఁడగుచు
విడిపించుకొనఁజూడ వడిగ మైందుఁడు డాసి కలన యూపాక్షుని గదిసి పోరి

గీ. సాహసంబున నాతలంగ జంపుటయును శోణితాక్షుండు ద్వివిదునిఁజూచి పొడువ
నతఁడు మూర్ఛిల్లి తెప్పిరి యసురఁబట్టి శిరము కూలంగ నడిదంబుచేత వ్రేసె. 73

గీ. శోణితాక్షుఁడు పోరిలోఁ జూర్ణమయిన కుంభుఁడప్పుడు కోపించుకొనుచువచ్చి
ద్వివిదు నొడుఁరొమ్ము నాటఁగ దీవ్రశరము లేసి వడిఁజంపె వాజిలో నేమి చెప్ప

క. తమ్ములపాటు గనుంగొని, హనుమ్మని మైందుండు కుంభను కఠినముష్టిన్
రొమ్మున బొడిచిన నతఁడొక్కుమ్మున గూలఁగ నేసె నసురుఁడలుకన్ 75

ఉ. అంగదుఁడంత కుంభునిశతాంగముపై నొకపర్వతంబు నా
మింగలయఁగ వ్రేయుటయు మేదినికిన్ వడి దాటి వాలిపు
త్త్రింగని దైత్యుఁడాగ్రహముతో ముసలంబున వ్రేయనొచ్చి
తోఁకం గొనివజ్రిపౌత్త్రుఁడు సగర్వమునన్ దగమోదె వాక్షమున్ 76

వ. అట్టి యవసరంబున. 77

క. కాలాంతకరుద్రులతోఁ బోలుపదగుకుంభుఁ డపుడు భుజబలశక్తిన్
వాలికుమారుని ధరపై గూలఁగ వడి నేసె నైదుకోలల నేతన్ 78

వ. ఇట్లు వాలికుమారుండు కుంభునిచేత బాణపీడితుండై పడుటయెఱింగి రామచంద్రుం
డు వానిపై సుగ్రీవజాంబవద్ధనుమదాదుల బంపిన 79

క. వారంద అధిపునాజ్ఞను, భూరుహములు గిరులుం గొనుచు భువనము లదరన్
బోరన నార్చుచు కుంభుని దారసమై వ్రేసిగంత దర్పోద్ధతులై 80

క. వారలు వేసినతరుగిరు లారయ దనుజాకకుండ నవి తునియలుగా
గ్రూరాస్త్రంబులదునుముచు, నారసములవారవారి నాటఁగ నేసెన్. 81

క. ఏసిన కుంభుని రవిజుం, డాసమయమునందు నేసెపదరంటుంగా
వేసిన గ్రిమ్మలు రవిజుని గాసిల వక్షంబు పొడువగానిలబడియెన్ 82

గీ. మూర్ఛ తేరి యారవిజుఁడమోఘముష్టి పూని దైత్యుని రొమ్ముపై బొడువనంత
శరధిమథియించు మంథగాచలముమాడ్కి ధీరతయడంగి దిద్దిరం దిరిగి పడియె. 83

మేఘనాథుండు నభమున కెగసి మహాంధకారబాణము వేసిన దానంజేసి పెంజీఁ
కటి గప్పిన జీకాకై పొరుచున్న వానరులం గని వాయునందనుండు శ్రీరామచం
ద్రునితో నిట్లనియె. 103

క. వాయువ్యాస్త్రముచేతను బాయును జుమ్మంధకారబాణక్షేపం
బీయెడ నేయుఁడు శ్రీరఘు, నాయక యని విన్నవింప నవ్వుచు నంతన్. 104

క. విల్లెక్కు వెట్టి మారుత భల్లము సంధించి విడిచి పార్థివు డలుకన్
బెల్లార్చి యేసెఁ గగనం బెల్లను వడి దూల దైత్యు డిలపై గూలన్ 105

ఆ. రాజతిలకు డంబరమ్మున కెగయంగ వాయుశరము దొడిగి వ్రేయ దడసె
మాయశక్తి దొలగిపోయిన నంతలో మేఘనాథు డుర్విమీద బడియె. 106

చ. పడియును మేఘనాథుడు సుపర్వులు బెగ్గిల నుగ్రబాణముల్
తొడిగి ప్లవంగసేనపయి దోరముగా నడరింప నంతటన్
బెడబెడ నార్చి మారుతి విభీషణు లుగ్రత దానవావళిన్
బొడిపొడి సేయ లక్ష్మణుడు పూనిక నాతని దాక నార్చుచున్ 107

క. అంతట దానవసేనలు పంతము చెడి తలలువీడ బాఱం గని తా
నెంతయు వెఱవక దనుజుడు గుంతము ద్రిప్పుచును దైత్యకుంజరు డంతన్ 108

శా. సౌమిత్రిం గని గర్వ మొప్ప బలికెన్ శౌర్యంబు సంధిల్లగా
నామీదం బఱపింపవచ్చి తవులే నాగాస్త్రసంఘంబులన్
నేమిమ్మందఱ గట్టుటల్ మఱచితే నేడైన జింతింపుమీ
నీ మా సత్త్వశేష మెల్ల మదియో నిక్కంబుగా లక్ష్మణా. 109

వ. అని బాణప్రయోగము సేసిన. 110

క. వానిని బ్రతిశరములు దా బూనిక సంధించి త్రుంచి భుజబలశక్తిన్
దానవుని మూర్ఛవుచ్చెను భానుకులుం డంత నొక్కబాణముచేతన్ 111

ఆ. ఇంద్రజిత్తంతట నినకులోద్భవుంచే మూర్ఛ నొంది తెలిసి మూర్ఖగతిని
భాసమాన మైనబాణత్రయంబున నతని నొవ్వ జేసి యార్చె నంత. 112

సీ. సౌమిత్రి తా వానిచాపంబు నడిమికి గంధర్వాస్త్రంబుచే దునుక జేసి
పదిబాణములు వాని బాహుమధ్యంబున గాటంబుగా వడి నాట జేసి
తురగంబులను నాల్గుతూపుల దునుమాడి సారథి నొక్కటి సంహరించి
శరవృష్టి గప్పిన సురవైరి కోపించి కాద్రవేయాస్త్రసంఘంబు లేయ

గీ. గరుడశరమున దునిమి లక్ష్మణుండు కినిసి వడి గుబేరాస్త్రము తనిపై వైచెనసుర
దానిదునిమాడి వేగ నైంద్రాస్త్ర మేసె నరవరుడు వానియామ్యబాణమున ద్రుంచె.

వ. ఇట్లు త్రుంచిన. 11

క. వరుణాస్త్రంబును నేసెను, సురరాజవిరోధి జనులు నిమిషాంతరమున
గర మలిగి రాముసోదరుఁ డురగారిగ వాని ద్రుంచె నైంద్రాస్త్రమునన్. 115

వ. అని మఱియును. 116

గీ. కనలి దానవుఁ డతనిపై గంధపుష్ప సమితి నొప్పెడు గంధర్వశరము దొడిగి
వ్రేయ గోపించి దశరథోర్వీపసుతుఁడు ఖండశశిబాణమున దాని ఖండఁదుంచె

వ. ఇట్లు గంధర్వశరంబున ద్రుంచి యంతటం బోవక దేవేంద్రదత్తం బైన భుజగా
స్త్రంబు వింట సంధించి వేదంబులు సత్యంబగు నేని రామచంద్రుండు ధర్మాత్ముం
డేని యింద్రదిబ్యంతారకద్రోహి యైన యింద్రజిత్తు శిరంబు నీశరంబు ద్రుంచుం
గాకయని వానిపై లక్ష్యంబు సేసి ప్రత్యాలీఢపాదస్థుండై నిలిచి కర్ణాంతంబుగాఁ
దిగిచి యేసిన నదియును కాలానలాభీలజ్వాలంబు లుప్పతిల్ల గగనంబునం బఱ
తెంచి యక్కసురక్కసుని శిరంబు ద్రుంచిన. 118

క. కనుగొని దేవతలందఱు దను బొగడఁగ మఱలి రాముతమ్ముఁడు విజయం
బున వచ్చి మ్రొక్కె నాతని, మనుజేంద్రుఁడు కౌఁగిలించి మఱి యిట్లనియెన్ 119

క. నీచేత వీఁడు మ్రగ్గుట నా చక్రంబెల్ల మేలు పొందెను వినుమీ
నాచేత దశముఖుం డను, నీచుఁడు దెగు నెల్ల నిజము నిర్మలచరితా. 120

వ. ఇట్లు సౌమిత్రిచేత నింద్రజిత్తు తెగిన చెప్పిన నారదుని వాల్మీకి మహామునీంద్రుం
డటుమీఁది కథావిధానం బెట్టిదని యడుగుటయు. 121

క. జలజాక్ష! భక్తవత్సల! జలజాసనవినుతపాద జలజాత! సుధా
జలరాశిభవ్యమందిర! జలజాకరచారుహంస! జానకినాథా. 122

గద్యము. ఇది శ్రీగౌరీశ్వర వరప్రసాద లబ్ధగురులింగ జంగమార్చనవినోద
నిత్యశైవాచార సంపన్న సూరిజనవినుతాతుకూరి కేశవశెట్టి
తనయ మొల్లనామధేయ విరచితం బైన శ్రీరామాయణ
మహాకావ్యంబునందు యుద్ధకాండమునందు
ప్రథమాశ్వాసము.





శ్రీరస్తు.

# మొల్లరామాయణము.

## యుద్ధకాండము-ద్వితీయాశ్వాసము.





అమలిన శుభచారిత్రా!
కమలదళసమాననేత్ర! కౌశికమిత్రా!
ద్యుమణికులవార్ధిసోమా!
సమదాసురజనవిరామ! జానకిరామా! 1

వ. శ్రీనారదమహామునీశ్వరుండు వాల్మీకికెరింగించిన తెలుంగెరింగించెద నాకర్ణింపుమట్లు

ఆ. చారు లరుగుదెంచి సౌమిత్రిచే నింద్రజిత్తు గూలెననుచు చెప్పుటయును
బంక్తిముఖుడు సుతుని బలుమారు దలచుచు వావగొచ్చె నెల్లవారు వినగ. 3

వ. ఇట్లనేకప్రకారంబుల గుమారుం బలవరింపుచు దుఃఖింపుచు గొంతతడవునకూర
డిల్లి ధైర్యము నూలుకొల్పి తన కుమారుం జంపినవానిని నే డవశ్యంబును సంగ్రా
మరంగంబున జంపుదునని నియమంబు చేసి తత్క్షణంబ. 4

సీ. శైలసన్నిభములౌ సామజంబులతోడ, ననిలవేగము గల్గుహయములతోడ
గాంచనోజ్జ్వలములౌ ఘనరథంబులతోడ బ్రతిలేనిఘనమూలబలముతోడ
గిమ్మీరవర్ణోరు కేతనంబులతోడ దరచైనపట్టుఛత్రములతోడ
భేరీమృదంగాది పృథువాద్యములతోడ వరశంఖకాహళధ్వానలతోడ

గీ. బాదఘట్టనచలితోర్వీభాగు డగుచు వనధు లెల్లను బిండిలివంటు గాగ
నడిచె లంకేశు దధికసన్నాహమునను రామచంద్రునితోడను రణ మొనర్ప 5

మ. కరిఘీంకారములున్ మహాజవతురంగవ్రాతహేషావళుల్,
వరకోదండవినాదముల్ సుభటదుర్వారాట్టహాసంబులున్
గురుశంఖోజ్జ్వలనాదముల్ దశదిశాఘోషంబుగా నాక్రమై
పరగన్ బంక్తిముఖుండు దా నడిచె కోపస్ఫూర్తి నిశ్వాసుడై

వ. ఇట్లు చతురంగబలంబులు గొల్వ లోకవిద్రావణుండగు రావణుండు సమరంబొనర్ప
నరుదేరం గని రాఘవేశ్వరుం డతనికిదండనాయకులం బంచిన వానరులు తరుగిరిపాషాణ

క. వనమున గలఫలమూలము లనుదినమును భక్తియుక్తి నర్పింపుచు మ
జ్జనకవిభుఁ గొలిచి నన్నును జనకగతిఁ బోషించి యొందుజనితివి తండ్రీ 48

క. నీవంటి తోడబుట్టువు నీవంటి గుణోత్తముండు నిజమూహింపన్
భూవలయమందుఁ గలడే భావింపఁగ నీకెక్కు పావనచరితా 49

క. నెలయుక నిద్రాహారము తెలియక పదునాలుగేండ్లు హితమతితో మ
మ్మరయుచు నరసిన నిన్నను నలుపనగునె నీతిగల్గుసుజనులకెందున్ 50

క. నిన్నిచట విడిచి పురికిని జన్నను వినుగన్నతల్లి సముదెంచి నన్నున్
నిన్నడుగ దడవ మదిలో జిన్నంబోవుచును నేమి చెప్పుదు దండ్రీ 51

వ. అని మఱియును 52

చ. వినుడు కపీంద్రులార పలవింపుచు సజ్జనకుండు సాకమున్
జనియె ధరాతనూభవ నిశాచరుచే జెఱవోయె నేటితో
ననుజుడు దీతెఱంగ నడియాసల నుండుట నాకు ధర్మమే
చనుడు నిజాశ్రమంబులకు సంశయ మొందక మీరు గొబ్బునన్ 53

వ. అని విభీషణుం గనుంగొని, 54

ఉ. అక్కట! నీవు నింటగలయట్టిసుబాంధవకోటిఁ బాసి నీ
విక్కడ కేగుదెంచితి వహీనముదంబున మమ్ము నమ్మి యెం
తెక్కుడుఁగ రావణుండు తగ వేడెడిలంకగడంక నీవు నేఁ
డక్కడఁగ నిత్తునన్ బ్రతిన దప్పె విభీషణ నీవు పోవుమా 55

వ. అని యనేకప్రకారంబుల బ్రలపించుచున్న రామభూపాలునకు సుషేణుం
డిట్లనియె 56

ఉ. దేవర! నీవు నీగతి మదిం దలపోయఁగ నేల తీవ్రమై
రావణుచేతిశక్తి బవరంబున నాటుట జేసి లక్ష్మణుం
డీవిధినుండె గాని ధరణీశ్వర! చూడుము ముఖారవిందమున్
జావదు సావ డియ్యెడ నిజంబుగ నమ్ము మనంబులోపలన్ 57

ఉ. పున్నమచందురుం దెగడి పొల్పెసలారెడి మోముదమ్మియున్
గన్నులు కల్వరేకులం గాంతి జయించెడు గానరక్తిమన్
జెన్నుదొలంగియుండ వఱుచేతులు బాదములున్ దలంపగా
నున్నవి వర్ణముల్ గలిగి యొప్పు తొలంగదు రాఘవేశ్వరా 58

వ. అని విన్నవించుచు హనుమంతుం గనుంగొని సుషేణుం డిట్లనియె 59

క. కాయన ప్రాణము లెత్తగ వాయుజు యలనాటినుండు వడి దేవతలే
వీయెడ నచటికి దడయక పోయి వెసన్ రమ్ము ప్రార్థనామవక మానుమె. 60

వ. అనిన భూకాంతుండు హనుమంతునకిట్లనియె 61

క. రమ్మువాయుతనూభవ యిమ్మహి సత్కీర్తిబడయుమీతనిప్రాణం
బిమ్మగరక్షింపుము నా తమ్ములలోనీవు నొక్కతమ్ముడ వరయన్ 62

వ. అని డాయంజని కౌగిటం జేర్చిదీవించి యంపెనప్పుడు 63

ఆ. పదములూది ద్రొక్కి వదనంబు దిగజాచి చేతు లూని నడుము చిక్కబట్టి
తిరిగి నిక్కియెగసి కుప్పించి వడిదాటి చనియె గగనవీధి ననిలసుతుడు 64

వ. అట్టి సమయమున 65

సీ. దనుజేశుడావార్తవిని కాలనేమిగే హమునకు నడిరేయి యతనితోడ
దనచేతహతుడైన ధరణీశుతమ్ముని ప్రాణంబులెత్తంగ బవనసుతుడు
చనుచున్న యట్టియాపని విఘ్న మొనరింప గ్రక్కునవటబోయి రమ్మటంచు
గాలనేమి యిదేటి కార్యంబు తగదన్న వినకకోపించిన వేగ నరిగి

గీ. ద్రోణశైలంబు చేరువత్రోవయందు వనము గావించి తగమునీశ్వరునిరీతి
జపము సేయుచుగన్నులం జక్కమూసి నడుము నిక్కించి పద్మాసనమునుండె.

వ. అప్పుడాకాశమార్గమున జనుచున్న యిప్పవనసుతుండు వనంబుం గాంచి
త్రోవదప్పెనని మనమున సందియమొందియమ్ము నీంద్రునడిగి చనువాడైయత
నికి నమస్కరించి యిట్లనియె 67

క. మునినాథ నేను రాముని పనికై చనుచున్నవాడ బరమౌషధముల్
గొని రావలె మది భావించి నిజమ్ముగ నిపుడు త్రోవ సెప్పుము నాకున్ 68

వ. అని ప్రార్థించి దాహోపశమంబున కుదకంబు వేడిన నక్కపటమునీంద్రుం
డిట్లనియె 69

ఆ. పవనతనయ రామభద్రుని పని మాకు దీర్చవలయుగాన శౌర్యతోడ
ప్రాణరక్షకౌషధ ద్రోణాద్రికరుగంగ వలదు వినుము వాదువనమునందు 70

గీ. ఘనతరంబైనసంజీవకరణి మొదలుగాగ దివ్యౌషధంబులు గలవు కాన
గొంచుబోవచ్చు గావున గోరుపండ్లు తనివి దీరంగదిని నీళ్ళుత్రాగుమిచట

వ. అని తనహస్తమున నున్న విమయుక్తంబైనకమండలూదకము చూపినం గని హను
మంతుండవి చాల వనిన నక్కపటమునీంద్రుండు కూరమకరావృతంబైన కమలా
కరం బొకం డెఱింగించి పొమ్మనిన బవనాత్మజుండు చని 72

క. విమలమకరందలుబ్ధ భ్రమరనికరపక్షపవనపరికంపిత స
త్కమనీయకుముదకైరవ కమలంబులు గలుగు కొలను గనుగొని యచటన్ 73

సీ. మడుగులోపలఁజొచ్చి కడుపారనుదకంబు గ్రోలంగ దిగ నందు గ్రాహి మొసలి
పాదముల్ కబళించి పట్టినఁ జరణముల్ విదళింపఁబట్టాని నడువకున్న
గడుసూక్ష్మరూపుఁడై కడుపులోపలఁజొచ్చి వేగంబు భేదించి వెడలెనంత
నది దేవకన్యయై యాకాశముననుండి తనదు వృత్తాంతమంతయును జెప్పి

గీ. వీఁడు దైత్యుండు నమ్మకు వీని జంపి పొమ్ము సంజీవికొండకు బ్రొద్దుగలుగ
నీకతంబున శాపంబు నాకుదీరె ననుచు దీవించి చనియె దానవరపురికి 74

వ. అంత హనుమంతుండు తేజోవంతుండై యరుగుదెంచి కపటసంయమిం గని వనతం
డిట్లనియె 74

చ. తడసితి వేల యింతవడి చాపున నే వసియించినట్టి యీ
మడుగున కేగి రాకునికి మౌనిసమానము తోచెనయ్య యి
ప్పుడు గలదేని గొంతగురుపూజకు విత్తము కాన్కవెట్టి నీ
వడుగుము మంగు లెట్టివి ప్రియంబగునట్టివి నీకు నిచ్చెదన్ 76

చ. అనవుడు గోపమెత్తి పవనాత్మజుఁడప్పుడు నీకు బూజకో
మ్మని యురముష్టిచే బొడువ నాతఁడు డీకొని పక్షిరూపుఁడై
తనఁగదియంగవచ్చుటయు దాని నపక్షముగాఁగ ద్రుంచినన్
గినిసి మృగేంద్రుఁడై పొడువఁ గేసరిపుత్రుఁడు దానిఁ గూల్చినన్ 77

గీ. అంత సుగ్రీవుండై వచ్చి యనిలతనయ బ్రతికె సౌమిత్రి మందులపని తలంప
వలదు రమ్మని నన్ను భూవరుడు పనిచె మగుడిపోదము పదమన్న మాట వినుము

వ. సుగ్రీవుండని విచారించి కాఁడండు బెఱింగి వాని బాహుమధ్యమున బొడిచిన
నతఁడు రూపంబు విడి శతశృంగుండై నొప్పించిన నలిగి జగత్ప్రాణనందనుండు
వాలమున నడిచి కరంబులు ఛేదించి శిరంబు ద్రుంచివైచి సింహనాదంబు జేసి
జయలక్ష్మిం గైకొని 79

క. ద్రోణాద్రికేగి మందులు శ్రోణిమి నీకున్న గినిసి పోల్పలరఁగ నా
క్షోణిధరము గలింపుచు బాణితలాగ్రమున బట్టి పట్టుక రాఁగన్ 80

సీ. కావలి యున్నట్టి గంధర్వగణములు పదునాల్గువేలు కోపంబుతోడ
నాహవంబొనరింప నందఱ నచ్చోట వాలముఖంబున వసుధ గూల్చి
గగనమార్గంబున గడుతీవ్రగతితోడ బోవ నందిగ్రామపురమునందు
దైలయుక్తంబైన తలతో బోరలాడ గలిగిన రామలక్ష్మణుల తెలుగు

గీ. భరతు డారాత్రికల గని భయముతోడ దొడరుదుస్స్వప్నదోషంబు దొలగిపోవ
విప్రవరులకు దానముల్ వేడ్కనిచ్చి వెలుపలను నున్న భరతభూవిభుని గాంచి
గీ. రాముడే యంచు నూహించి రాముడేల వచ్చునిచటికి సౌమిత్రి వనచరులను
జనకనందన దగడించి జగ మెరుంగ బగరజంపక రానేమిపని తలంప 82
వ. అని యిట్లు సందియంపడి కాదని నిశ్చయించి యంత హనుమంతుండు దక్షిణపా
థోనిధి దరియింప జనునప్పుడు దశాననుపంపున సేనలగూడి మాల్యవంతుండెదిరిం
చి శస్త్రాస్త్రంబులు గురియించి నొప్పించినంగని వాతూలసంభవుండు వాలముల్లార్చి
యార్చి పేర్చి దనుజబలంబులం జలంబునందతిమి వాలముఖంబుల గళంబులం పట్టి
నానాముఖంబులం బాఱవైచినం గని మాల్యవంతుండు తీవ్రశరంబుల నొప్పించిన
నదరి యద్దానవేంద్రునికంఠంబున వాలంబు గీలించి గిర గిర ద్రిప్పి సముద్రమధ్య
మున బడవైచిన వాడును బాతాళమునకుంజనియె నాక్షణంబ 83
గీ. మాల్యవంతునిబోకార్చి మానుషమున గగనమండల మందంద పగులనార్చి
వచ్చునప్పుడు శతకోటి వాదిజాప్త దీప్తిగనుపట్టెబ్రాచీనదిక్కునందు 84
వ. ఇట్లు వెలుంగుచున్న మహౌషధాచలంబు దివ్యదీప్తులుగ నుంగొని రాఘవేశ్వరుండది
సూర్యోదయంబని మనంబునదలంచి కపులతో నిట్లనియె 85
చ. అదె కనుగొంటిరే కలయనర్కుడు పూర్వగిరీంద్రశృంగమం
దుదయమునొందె నింక నిటనుంచిదమ్ముని ప్రాణవాయువుల్
బ్రదుకుట దుర్లభంబకట పల్కులు మొక్కెడుప్రొద్దెమాకుదా
నదయత శత్రుదయ్యెగపులార వినుండిదెమీకుచెప్పెదన్ 86
గీ. మాకులంబున కెల్లను మహిని దలప దాన కర్తయైయుండియు ధర్మమగునె
యుదయమందంగమనుమడిట్లున్న యెడను గొసరి చుట్టాలుబగవారిగూడవలెనె
క. ఈలాగునదాబోడిచిన మాలక్ష్మణుప్రాణమేల మగుడుంగా భానుం
గూలగ నేసెద విల్లును గోలలు దెమ్మనుచు నందిగొను నాలోనన్ 88
వ. రామచంద్రునకు జాంబవంతుండిట్లనియె 89
ఉ. భానుడు కాడు చూడు నరపాలక మందులకొండదీప్తులీ
మానముదోచె గాని మనమానములేదు వినుండు వేడ్కతో
వానరసేన నింకెందరు వాయుతనూజుని గారవింపగా
మానవనాథపంపుమనుమాత్రనె వచ్చె నతండు తీవ్రతన్ 90
క. అనిమిషులు సన్నుతింపగ హనుమంతుడు ద్రోణశైల మతిశీఘ్రముగా
గొని వచ్చి నిలిచి రఘురాముని శ్రీపాదముల కెలమి మ్రొక్కెనయంతన్ 91

వ. రామచంద్రుం డతనిం గౌఁగిలించుకొని సుషేణుం జూచి నీ విందలి దివ్యౌషధము
లవలన సౌమిత్రిప్రాణములు దేర్పు మనిన నయ్యధిపు నాజ్ఞ శిరంబున దాల్చి వన
చరసహాయుం డై పర్వతం బెక్కి తొల్లి దేవత లమృతపానంబు చేసినతావును, నారా
యణుండు మోహినీరూపమున నమృతము పంచునప్పుడు సూర్యచంద్రుల నడుమ
జిక్కిన రాహువుశిరంబు ద్రుంచిన తావును బలిచక్రవర్తి యాగంబు సేసినతావును
రాక్షసులు జన్మించినతావును శంకరభగవానుఁడు పర్వతరాజుకూతును బెండ్లియా
డినతావును వానరులకుం జూపుచు నగ్గిరీంద్రంబు పైనున్న యౌషధంబులుఁ గొని
వచ్చి ప్రయోగింప నాయౌషధముల సామర్థ్యంబునం జేసి లక్ష్మణునకుఁ బ్రాణం
బులు మగుడవచ్చె నంత సకలవానరులు నానందరసాబ్ధిం దేలి రప్పుడు సౌమిత్రి
రామునకు నమస్కరించిన రామచంద్రుండు కౌఁగిటం జేర్చి హనుమంతుం డొనరిం
చిన యుపకృతికి సంతోషించి యాపర్వతంబును దొల్లింటియునికిఁ జేయుంచిరమ్మ
నిన నతం డట్లు కావించె నని నారదుండు సెప్పిన వాల్మీకిమునీశ్వరుం డటమీఁది కథా
విధానం బెట్టిదని యడుగుటయు 92

క. జలజాక్ష! భక్తవత్సల! జలజాసనవినుతపాదజలజాత! సుధా
జలరాశిభవ్యమందిర! జలజాకరచారుహంస! జానకినాథా! 93

గద్యము. ఇది శ్రీగౌరీశ్వర వరప్రసాద లబ్ధగురులింగ జంగమార్చనవినోద
నిత్యశైవాచార సంపన్న సూరిజనవినుతాతకూరి కేశనశెట్టి
తనయ మొల్లనామధేయ విరచితం బైన శ్రీరామాయణ
మహాకావ్యంబునందు యుద్ధకాండమునందు
ద్వితీయాశ్వాసము.





శ్రీరస్తు.

# మొల్లరామాయణము.



## యుద్ధకాండము - తృతీయాశ్వాసము.






మలసుధాకరవదనా!
సుమనస్స్తుతోజ్జ్వలపద! సుస్థిరకదనా!
కమనీయరద! శతమఖ
మహిత! రఘుకులసార్వభౌమ! జానకిరామా! 1

వ. శ్రీనారదమునీంద్రుండు వాల్మీకికి నెఱింగించిన తెఱంగు తెలింగించెద నాకర్ణింపుము 2

క. కలకల పక్షులు గూయఁగ బలపలనై తారకములు పడమటఁ గ్రొపన్
జలజములు విరియ దూర్పున బలబలనై తెల్లవాఱ భానుఁడు పొడమెన్ 3

సీ. అటమున్న దశకంఠుఁ డాచార్యుఁ డైనట్టి శుక్రాగ్నిమతి దేహశుద్ధితోడ
రణజయార్థంబుగా రథములు గుఱ్ఱముల్ కవచంబు లస్త్రసంఘములు గలుగ
బాతాళగుహఁ జొచ్చి వీతిహోత్రునిఁ గూర్చి సేయుచు హోమంబు సేయుచుండ
నాహోమధూమంబు లాకసంబున బర్వ గని విభీషణుండు భూకాంతునకును

గీ. విన్నవించెను మాయన్న వెన్నఁ దరిగి హోమ మొనరించుచున్నాఁడు దుడుఁగకేవుడు
మొనసి యాహోమ మది తుదముట్టెనేని గలన బ్రహ్మాదులాతని గెలువలేరు 4

క. ఈపని విఘ్నము సేయఁగ భూపాలక కపుల నేర్చి పుచ్చుము లేదే
మీతని విఘ్నమగు ననుడు భూపాలవరేణ్యుఁ డపుడు భూధరవసులన్ 5

చ. గవయ గవాక్ష వాలిసుత కంజహితాత్మజ నీల వాయుసం
భవ నల గంధమాదన విభాషిత భల్లుకనాథముఖ్యులన్.
దివిజవిరోధి హైబనుప దీవ్రత నేగి పురంబు సొచ్చి నా
నవవతి సేనలందఱిమి నాకము భేదిల నార్చియ త్తరిన్ 6

క. గుహ సొచ్చి దనుజవల్లభ విహితమె సాహసము విడిచి విను మనివృత్తిన్
దహనగతధూమరేఖల నహరహము నీకు వేల్వనగ్గంబగునే 7

క. మగటిమి గలిగినపురుషులె మగతనము విడిచినట్టి మగువలు నగరా
తగ దనక నేఁడు మలుఁగున విగతవ్రీడుండ వగుచు వేల్వఁగ దగునే 8

మ. అని కేతెంచి నృపాలశేఖరుడు వాహ్యాళిప్రదేశంబునన్
నిను రక్షించుచు బిల్చుచుండ నచటన్ నీవుండి వ్యాజంబునన్
దనుజాధీశ్వర వీరధర్మ మగునే తప్పించికో నంచు న
వ్వనచారుల్ సిగవట్టియీడ్వగ సుగ్రీవాఖ్యుఁడుండు నిశ్చింతుడై. 9

క. కదలక హృదయజ్ఞానము వదలక మంత్రించుచొప్పు వడి తప్పకలో
బెదరక వ్రేలుచు సుగ్రీవ బెదరక కూర్చుండెనట గభీరప్రౌఢిన్ 10

వ. ఇట్లు శిలాస్తంభంబు పగిది జపింపుచున్న నతంజేతి యోహాలుతులు పిడిఁ బో వైచి పుస్తకంబులు నలుగ ద్రొక్కియిధ్మంబు హోమద్రవ్యంబులు నొక్కింత నగ్ని లో ద్రోచి హోమాగ్నిం జిందరవందరగఁ జేసి భుజంబు లెక్కి మీసలు పట్టుకొని లాగి తలలు గదలించి వీనుల బెనుబొబ్బలిడి కదలకున్నం గినిసి వాలితనూభవుం డంత నంతఃపురమునకుం బోయి యందున్న మండోదరిని జుట్టుపట్టియీడ్చుచు బయటికి గొనివచ్చి దశవదనుముందట నిలుప నక్కాంత దుఃఖాక్రాంతయై తన కాంతున కిట్లనియె 11

గీ. రామచంద్రుండె యాదినారాయణుండు కపులె దేవతలని నీకు గనబడంగ
నెల్లవేళల నీచెవి నిల్లుగట్టి విన్నపము సేయుదు నామాట వినకపోతి 12

మ. మయదైత్యేంద్రునకుం దనూజ నయి నేమం బొప్ప నీపత్నినై
జయ మెప్పింగను నింద్రజిజ్జననినై సన్మాన్య సాపూజ్యనై
భయ మెన్నండు నెరుంగనట్టి నను నిబ్భంగిన్ వనాటుండు ని
ర్భయవృత్తిం దలవట్టియీడ్వగను గోపాలైతి నీముంగలన్ 13

క. రామునిదూతలు నన్నను భాములు పట్టంగ జూడబండు వేగిరున్
నామానము గాపాడని నీమానుప మేటికిపుడు నిగ్రహవైరి 14

ఉ. ఈను నివృత్తికన్న దనుజేశ్వర! రామునితోడ నేడు సం
గ్రామము సేసి గెల్చిన నఖండగమావిభవంబు గల్గునా
రామునిచేత జచ్చిన స్థిరం బగు మోక్షము గల్గదీనికై
యేమిటికింత ధైర్యమిసి! యిచ్చదలంపుము రాక్షసేశ్వరా! 15

వ. అని యనేకవిధంబులగా దీనాలాపము లాడుచు వెక్కి వెక్కి యేడ్వంగ నిలజించి మహోగ్రాకారుండై లేచి దగ్ధశేష కాండంబులచే వానరవీరులకరంబులు శిరంబులు ముక్కులు చెవులు నలుగ మొత్తి నంబళించి వారు రామచంద్రుని సముఖంబునకుం బోయి తాము పోయివచ్చిన పని విన్నవించి రట్టిసమయమున 16

గీ. వనచరుల ద్రోలి క్రమ్మర నగరి కరిగి పంక్తికంఠుండు ధైర్యంబు పాదుకొల్పి
విన్నదనమున వగపున జిన్నవోయి చెంత నున్నట్టి తనకులకాంత జూచి 17

క. చాకేలు పట్టి వెలసిన నీ కేలా చిన్నవోవ నీరజనయనా
నాకులు బెదరక నల యిక్ష్వాకుకులోద్భవుల గెలిచి వచ్చెద నింకన్ 18

గీ. తెలియ మయపుత్రి నాదుప్రతిజ్ఞ వినుము వనచరులతోడ రామభూవరుని నేడు
చంపు టొండెను వానిచే గాని యూరక మరలుట కానిమాట

వ. అని వీరరసంబుప్పొంగ బ్రతిజ్ఞాలాపముల దనపట్టపుదేవియగు మండోదరి నో
దార్చి కొలువుకూటమున కేతెంచి యచ్చట 20

క. శిరముల వీనుల గళముల గరముల నురమున నడుమున గనుపీయపదాం
బురుహముల భూషణావళు లురుదారగ దాల్చి మోహనాకృతి మీఱన్ 21

గీ. గంధమాల్యాంబరాదులు బంధురముగ మేన గలయంగ ధరియించి దానవేంద్రు
డంత రణభేరి వేయించి పంత మలర బిరుదురాహుత్తకోరుల బిలువబంచె 22

వ. అట్టియవసరమున 23

ఆ. కోప మడర ఖడ్గరోముండు వృశ్చికరోము డక్షిసర్పరోము డగ్ని
వర్ణుడాది గాగ వచ్చిరి రాక్షసవీరు లపుడు దనుజవిభుని గొలువ 24

క. ఇరువదిచేతుల శస్త్రాస్త్రోత్కరములు మెఱయంగ దాల్చి కౌతుక మడరన్
దురగములు నూరు గట్టిన యరదముపై నూరుచుండి యతివిభవమునన్ 25

సీ. భేరులు తమ్మటల్ పెల్లునిస్సాణముల్ బూరగొమ్ములు కంచువీరణములు
మద్దెలక్రోవులు వీరమద్దెలల్ గిడు గిళ్ళు పేరైన తప్పెటల్ పిల్లగోళ్ళు
తారలు చిమ్మటతారలు శంఖముల్ కాహళాల్ పసిడిఛక్కాలును బిరుదు
గాలిగొమ్మలు డోళ్ళుకైవళ్ళు రుంజలు ఛత్రసంఘంబులు చామరములు

గీ. బొబ్బకలగ దిక్కులు బూరటిల్ల దనుజవర్గంబు లిరువంక దనిలి కొలువ
వెడలె సన్నాహ మడరంగ వీరరసము కరువుగట్టినచందంబు గానబడగ 26

క. కాలాగ్ని కాలభైరవ కాలాంతక కాలదండ కాలాహికరా
భీలసముద్యద్దినకర కాలాకృతితోడ బంక్తికంఠుడు వెడలెన్ 27

వ. ఇట్లత్యుత్సాహముగా యుద్ధరంగంబునకు బయలుదేరిన సమయమున 28

చూర్ణిక. జయజయ కైకసీగర్భసముద్రసంపూర్ణసుధాకరా! జయజయ మయతనూజా
మనోహరా! జయజయ రాక్షసకులసార్వభౌమా! జయజయసాగరావనలంకాధీశ్వ
రా! జయజయపాకశాసనభద్రశ్రీహరణచతురా! జయజయకుటిలవైశ్వానరపుటభే
దననిర్ధూమధామా! జయజయసమవర్తిసంపద్విచ్ఛేదకా! జయజయదనుజవల్లభహాల్ల

కల్లోల! జయజయ యక్షేశ్వరతో యశోమణ్డనదావానలా! జయజయ పుష్పకాపసం
హారా! జయజయ యక్షనాయకదుర్గాపహారకా! జయజయ యీశాన్యై
శ్వర్యహరణోద్యమా! జయజయ నవగ్రహానుగ్రహనిగ్రహా! జయజయ దశగ్రీ
వాలకాకారా! జయజయ కైలాసనగేంద్రోత్పాటనకందుక క్రీడావినోదా! జయ
జయ భవానీశ్వర శ్రీపాదకమలశిరఃకంజాతపూజాసమర్థా! జయజయ పుష్పకా
రూఢసకలదిగంతనక్రాంతా! జయజయ బ్రహ్మవంశప్రదీపకా! జయజయ
త్రిలోకవిజయా! రావణేశ్వరా! జయీభవ దిగ్విజయీభవ. 29

వ. అని వందిబృందంబు లుభయపార్శ్వంబుల జయజయధ్వనులతో బిరుదుగద్యపద్యం
బుల వర్ణింప ముక్తాతపత్రముల నడుమ మహిళామండలార్పితచామరపవ
నకంపితకుండలుండగుచు వీరరసంబు పురుషాకారము దాల్చినలీల నేతేర మజ్జ
గంబులు గడగడ వడంకె కులాచలములొడ్డగిల్లె జంత్రర్కమండలంబు లెత్తడం
బడె నక్షత్రములు డుల్లిపట్టిసముద్రముల గరిబృంహితములు నశ్వహేషారవం
బులును దనుజభటాట్టహాసంబులును సురత్రాసజనకంబులుగా బటహనిస్సాణభే
రీఝంఝాహాళ భాంకారరవంబులును బ్రతిధ్వనుల నీను నంత రావణుపై మేఘం
బులు రక్తధారలు వర్షించె బిరుదధ్వజంబులు విఱిగి పడె మొసరంబులవాలంబు
లనుండి విప్పునిరిల్లె దిక్కులధూమంబు నిబిడంబై పర్వెనట్టు కామునిసేనావణుండు
తెగుట యవశ్యంబని సభంబును మోగె నట్టియవసరంబున 30

క. భూనాయకు డతివేగమ దానవ సేనలకు నెనుచు దాక్షిణ్యస్ఫోటక
వానరసేనలబంపెను భానుజముఖ్యాధిపతుల బౌరుష మడరక 31

మ. తరుశైలంబులతోడ నార్చుచు భుజాదర్పంబులుప్పొంగ వా
నరవర్గంబు లెదిర్చివచ్చె నెడ నానాకారులాదక్షిణో
త్తరవార్ధుల్ ప్రకటించు డాయుగతినుగరత్నాగ్రిధిపారాన్వంచు సం
గరముం జేయగ జొచ్చి రంత సుర రాకాశంబునం జూడగ 32

సీ. కపుల నెక్కించి భీకరలీలద్రొక్కించి వాజుల దోలితివ్రముగ నేయ
రథములబఱపి శిరంబుల జక్కాడి చెలగి పదాతుల జేరి పొడువ
బంతంబు జేయూఱబ్బనగోత్రముల గేరి తరువులు బాషాణతతులు బఱపి
శైలంబు లడరించి సంహారకంబులు సేయ గలగక దైత్యులుగపులు గలసి

గీ. పోరునప్పుడు వానరవీరులసుర వరులమీదను బాషాణవర్షసుధిక
లీలగురియింప దనుజాలాపేళ విఱిగి తలలు వీడంగబఱచిరి తత్తరమున 33

సీ. మెండైనరథములమీదికి గుప్పించి విక్రమప్రౌఢిమై విరూపాక్షు
కరులకొమ్ములు పట్టి బిర బిర వడి ద్రిప్పి జగతీస్థలంబునజదియగొట్టి
తొడరి సైంధవకోటి కడకాళ్ళువిదళించి పట్టిపెన్ జెక్కులువాఱగొట్టి
కాల్బలంబులపైకిగదిసిశస్త్రంబుల తోడగూడనె చుట్టితునియ గొట్టి
గీ. ఛత్రములు గూల్చిచామరసమితి విఱిచి కేరలియూర్పుమబిరుదుటెక్కెములు చించి
వాద్యసంఘంబు లవలీల వసుధ గూల్చి కపులు వోలిరి దానవగణము లెల్ల 34
ఆ. అంతబంక్తివదను నరదంబు నెదురుగా నడుచువాయుపుత్రునకును ఖడ్గ
రోముడనియె నతని రూపించి నాతోడ రణముసేయు వేగ రమ్మటంచు 35
చ. పిలిచిన రోష మెత్తికడుభీకరవృత్తిని ఖడ్గరోముతో
దలపడ వానిరోమములు దాకి శరీరము నొచ్చి యంతలో
బల నొకపర్వతంబుగొని పావని దైత్యునిమీద నేయ ని
శ్చలతను ఖడ్గరోముడును జక్కగజేసెను దత్క్షణంబునన్ 36
చ. మఱియొకపర్వతంబు హనుమానుడు గైకొనివచ్చి క్రమ్మఱన్
మెఱవడి ద్రిప్పి తద్రథముమీదను వైచిన వజ్రధారచే
బఱియలువారి ధాత్రిబడుపర్వతమాయన జేరితోడని
ర్భరముగ ఖడ్గరోముడు సపాటుగగూలె దురంబులోపలన్ 37
ఆ. రోజి కలన ఖడ్గరోముండు గూలుట సర్పరోము డెఱిగి సాహసమున
వాలిసుతుని దాక వానిరోమంబుల విషము సోకినొచ్చి వేగ దెలిసి
క. ఆలోన సర్పరోముని దూలింపుచు వాలిముక్కుదూలము పగులన్
వాలితనూజుడు దన్నిన జాలంగా నొగిలి తెలిసి సాహస మొప్పన్ 39
ఉ. వాలితనూజు డెన్నుదుర వ్రక్కలువాఱగ సర్పరోముడా
భీలత నార్చి చేకోలది చెక్కుని కొట్టిన రక్తధారలన్
దేలుచు నంగదుం డతని డీకొని ఫ్రానిశిరంబు చెక్కలై
వ్రీలిపడంగగొట్టబృథివీస్థలి గూలెను సర్పరోముడున్ 40
క. ఆలోన సర్వరోముడు గూలుట కనుగొనుచు మిగుల గోపంబునదా
వాలోకవృశ్చికరోముడు నీలుని పైరథముదోలెనిశ్చయవృత్తిన్ 41
ఉ. బోరననీలు డంత నొక్కభూజము గైకొని వాని తేరిపై
కూరిమి నేసి యాక్షణమ చూర్ణముగా నొనరింప నేలకున్
ధీరత దాటి భూరుహము ద్రెంపగనుంగొని నీలు డొక్కమం
దారమహీజమున్ వైచె ధారుణి వృశ్చికరోము డీల్గగన్ 42

సీ. వృశ్చికరోముఁ డా వేళఁ బ్రేరించుటఁ జేసి, పడిరోషమున నగ్నివర్ణుఁ డదరి
త్రేతాగ్నులొక్కటై తెరలి యుండినలీల దన మేనిమంటలు దరికొనంగ
రావణు నెదురఁ బరాక్రమస్థితిఁ జేర్చి రామచంద్రునిమీఁద రథముఁ దోలి
ప్రల్లదంబున బెక్కుభావలు నుడువుచు సాయకనిచయంబు సేయు నెడను
గీ. వాని శౌర్యంబు డెంపును వానిబలము జూచి భూపాలుఁ డప్పుడు చోద్యపడుచు
ధనువునందును వారుణాస్త్రంబు దొడిగి యగ్నివర్ణునితలఁ ద్రుంచె నాక్షణంబ 44
గీ. అగ్నివర్ణుండు తెగిపోవుట సురవరుఁడు గన్నులారంగఁ గనుఁగొని కలుషవృత్తి
రామచంద్రుని డాయంగ రథముఁ బఱపి పలికె నుత్కటగర్వప్రభావుఁ డగుచు
క. జారకుమారవీరము చెడి పారకుమా రిపులు నవ్వ భయపడి వనమున్
దూరకుమా పేర్కొంచును వీరకుమా కపులదోడు చేకొని పోరన్ 45
మ. అని విల్లెక్కిడి దైత్యనాయకుఁడు రోషాయత్తచిత్తమ్మునన్
ఘనమౌర్వీనినదంబు భీకరముగా గావించి పెల్లార్చియు
జననాథాగ్రణిమీఁద నుగ్రశరముల్ సంధించి బిట్టేయఁగా
వినువీధిన్ సురసంఘముల్ గొలువఁగా వీక్షించె దేవేంద్రుఁడున్ 46
వ. ఇట్లు కనుంగొని 47
క. రథ మెక్కి రావణుండును బృథివీస్థలి నుండి రాము పృథ్వీపతియున్
బ్రధనము సేయుట తగదని వ్యథఁ బొందుచు నాత్మలోన వాసవుఁ డంతన్ 48
క. మాతలిచేతను గవచము, చాతుర్యము గలుగు రథము చాపము శరమున్
మాతలి నాయకునకుఁ బురుహూతుఁడు పుత్తెంచెఁ గడు మహోన్నతమహిమన్
వ. ఇట్లు పుత్తెంచిన 50
చ. ధరణికి వచ్చి మాతలి ముదంబున రాముని జూచి మీకుఁగా
సురపతి పంపినాఁ డధికశోభనకృత్యము లై వెలుంగు నీ
శరములు విల్లు వజ్రకవచంబును దేరును వీని చేత సం
గరమున దైత్యునిం దునిమి కైకొను రాఘవ శ్రీజయంబులన్ 51
వ. అని చెప్పిన మాతలిప్రియవచనంబులకు సంతసించి విభీషణానుమతంబున రామభూ
పాలుండు వజ్రకవచంబు దొడిగి శరశరాసనములు గైకొని యింద్రస్యందనంబు
నకు వలగొని వందనం బాచరించి బాలాదిత్యుఁడు పూర్వపర్వతం బెక్కుచందంబున
రథం బెక్కినంత జయజయధ్వనులతో సుగ్రీవాంగద హనుమదాదులైన వానర
వీరులు మ్రొక్కి రప్పు డంతరిక్షణంబున దేవసంఘంబులు సంగ్రామరంగంబుఁ జూడ
వేడ్కపడి వచ్చినవిమానంబులతో గ్రిక్కిరిసి చూచుచుండి రాసమయమున 52

క. గిరి గిరి నభము నభంబును ధరధరయును జలధి జలధి దార్కొనురీతిన్
సురరిపుడు సురరిపును దురమున నెదురించి రథికదోర్బలయుక్తిన్ 53

వ. ఇట్లు మార్కొనుచు 54

శా. వీరాలాపము లాడుచుం గదిసి దోర్వీర్యంబుతోడన్ ధను
ర్జ్యారావంబులు మిన్ను ముట్ట నతితీవ్రం బైనశబ్దంబులన్
వారాసుల్ కలగంగ నార్చి నిజగర్వస్ఫూర్తి నుప్పొంగుచున్
ఘోరాస్త్రంబుల నేసి రొండొరులపై గోదండపాండిత్యులై 55

క. దనుజేశుడేయుశరములు మనుజేశుడు తప్పద్రుంచు మార్కొని కడిమిన్
మనుజేశు డేయుశరముల దనుజేశుడు దప్పద్రుంచు నతభుజశక్తిన్ 56

క. కంటబున నేసినశరములు వింటన్ దప్పించుకొనుచు వెసబాణములన్
గెంటింపుచు దమగాత్రము లంటక యుండంగ వేటులాడిరి కడిమిన్ 57

క. మొదల నొకబాణమావల బదులును వేయును బదివేలును నే
బదివేలు లక్షకోటియు జెదరక విలుకొండ్రమీద శీఘ్రముపర్వెన్ 58

క. తొడిగినబాణము వింటను దొడిగినయట్లుండు మిగుల దోడ్తోనవలన్
వెడలెడుశరములు లెక్కకు గడగుట్టు తవరాక చిత్రగతులంబర్వెన్ 59

వ. అట్టి సమయమున. 60

చ. అభవముఖాంతకాదులు మహాత్ములు వింటికి వారికన్నను
ద్రిభువనమందు వీరె గణుతింపగ నెక్కుడటంచు మెచ్చుచున్
నభమునుండి ప్రస్తుతి ఘనంబుగ జేతురు దేవకోటు ల
ల్లుభయబలంబులం బొగడుచుండిరి రాముని రావణాసురున్ 61

చ. ధనువులమ్రోత మేఘనినదంబునుగా శరదీపికాలముల్
ఘనతరచంచలావళులుగా మణిమౌక్తికదీప్తి ధాత్రిమీ
దనువడగండ్లు గాత్రజధారలు సంతతవర్షధారగా
ననయముం జెప్పనొప్పి విపులాహవ మప్పుడు వానకాలమై 62

గీ. పంక్తికంఠుండు మిగుల గోపంబుగదుర, దేవగంధర్వశరము సంధించి తివిచి
రామభూపాలుమీద విక్రమము మెఱసి, వేడి వడినార్చెదిగ్దంతివిసరమదల 63

క. దానికిం బ్రతిశర మప్పుడు, మానవనాథుండుదొడిగి మానుపమదరన్
బూనిక నేసిన దానిం, బోనీయక త్రుంచివైచె భువనములలరన్ 64

క. త్రుంచిన గనుంగొని దనుజుండు, మించినకోపమున రామునిమీదను వడిసం
ధించి సురద్విషబాణము, వంచింపక యేసె దానివలనన్ జాలన్ 65

ఆ. నాగశరము లొదవి నానాముఖంబుల వచ్చునపుడు మనుజవల్లభుండు
గరుడబాణ మేసి ఖండించె నన్నింటి మింట సురలు చూచి మెచ్చి పొగడ 66

చ. అధిప వృషవాహునకు దనుజుఁ డాగ్రహమూని కరత్రిశూలము
య్యాదనున ద్రిప్పివైవ విపులార్చుల జేర్చుచు వచ్చుదానిపై
వదలక ముంచుగా ద్రిదశవల్లభుఁడిచ్చినశక్తి నేసినన్
బొదలుచు ఖాతిత్రుంచె మణిభూషణజాలము నాత్రిశూలమున్ 67

వ. ఇట్లు శూలంబును దూలిపోయిన 68

క. సూతుని రథమును వాజుల గేతువు దూలంగ నేసి కినుక మెయి జే
సేతను నొప్పించిన నృపు డాతరి దైతేయవిభుని నద్భుత మడరన్

క. నూటిగొని యసురతలల కిరీటము లవలీల డుల్లి రివ్వన నొసలన్
బీటలువార శతాంగము ఘోటకములగుండె లవిసి కూలగ నేసెన్ 70

ఉ. ఆయెడ దైత్యనాయకుఁడహంకృతి రాముని మేననాటగా
వేయుశరంబు లాయముల వేగమె గాడిన రక్తపూరముల్
గాయము దొప్పదోగ వడిగ్రమ్మెను నప్పుడు మీద నొప్పెబ
ద్మాయుతశోచనుండు చరమాద్రితటిం దగు భానుడో యనన్ 71

ఆ. అంత రామచంద్రుఁ డత్యంతకుపితుడై బాణవృష్టి గురియ బంక్తిముఖుడు
కాలు వ్రేలు చెయ్యి కదలింప నోపక మెదలలేక రథము మీద నొరిగె 62

వ. రావణుండు సొమ్మసిల్లిపోవ నెరింగి కాలకేతుఁడు తేరు దూరముగా గొనిపోయిన గొంత ప్రొద్దునకు దనుజేంద్రుండు మూర్ఛ దేరి యోరీ పగవారలు నవ్వ దగ దనక రథంబిట్లు తేదగు నేయని కోపించిన గాలకేతుండును యుద్ధమధ్యంబున దేరికి సంకటంబైన రణంబు వెడలగొనిపోవుట యోటమి గాదని ధర్మవిదులు సెప్పుదురు గావున నేనిట్లు దెచ్చితినని విన్నవించిన సూతు వాక్యంబులకు మెచ్చి పసదనంబు లిచ్చి మనరథము రాముని పయిం బఱపు మనిన నట్లు కావించినన్ గనుంగొని 73

క. ఆతని రథమున కెదురుగ మాతలి నిజరథము బఱపుమా యన నతడున్
జేతీవ్రగతిం బఱపిన భూతలపతి పలికె దనుజపుంగవుతోడన్ 74

ఉ. భూరిభుజప్రతాపమున బొంగుచు నిర్జరకోటి మాటికిన్
బోర జయించి తంచు బలుపోకలు పోదువు నీవు భీతవై
దారక నిల్చి నాయెడ ప్రతాపము సూపుము చూపవేని నా
వారిజగర్భుఁ డడ్డపడవచ్చిన జంపుదు నిన్ను రావణా. 75

ఉ. తలములోన వానరుల నాలము సేసినయట్లు గాదు నా
పాలిశరంబు నీదుదుటిఁబ్రాలు వారింపఁగ జాలుపడ్డది
వేళ క్రుధాపహాస్యములు వేయివిధంబుల మానలేక తాఁ
గాలుడు కన్నుఁ గీఁటె నదె కాలము దగ్గరె నీకు రావణా 76

చ. హరి గిరి వహ్ని నిహ్ని బ్రళయాంతకు నింతకు దైత్యు నిత్యవా
ర్వరు నిను గాడ్పు నిప్పు ధనవల్లభు నిల్లభు రుద్రు నిద్రు సం
గరమున నోర్చినట్టి దశకంధర నీకు జయింప వచ్చునే
సురనరభీరు సుగ్రీవరణశూరు బహూధికభీరు రాఘవున్ 77

క. మతి దలఁప సుఖరతిం బతి వ్రతలను మునివరుల బట్టి వ్రతములు గర్వో
న్నతి జెఱచినట్టి దురిత స్థితి నిప్పుడు నీవు కాను జిక్కితి విచటన్ 78

వ. అని గర్వాలాపంబులాడుచున్న యుర్వీశునకు బూర్వగీర్వాణాధీశ్వరుం డగు
రావణాసురుం డిట్లనియె 79

క. అంతటి మారీచపరాక్రమ వంతుడవా యెఱుఁగనే వసుధేశ్వర నా
పంత మెఱింగియు నెఱుఁగక యింతబ్రగల్భముల నాడ నేటికి నీకున్ 80

క. నీలావున నాలావున వాలాయము సురలు చూచి వర్ణింపఁగ నే
డాలములోపల జూపుద మేలా గర్వోక్తులిప్పు డినకులతిలకా 81

మ. జననాధాగ్రణి! నాప్రతిజ్ఞ వినుమా శాంతాస్త్రుఁడై నీవునై
వనజాప్తుం డిటువచ్చి కావు మనుచున్ వైళంబ నన్ గోరినన్
వినువీధిన్ సురలెల్ల జూచి వెఱవన్ వీరంబు సంధిల్లఁగా
నిను నీతమ్ముని జంపకుండ మరలన్ నే లంకకుం బోదునే. 82

వ. అని కోపోద్దీపితమానసులై వీరాలాపము లాడుచు నిద్దఱు నద్దవిడి గద్దింపుచు
నోలి మాసగొనక మీఱినకోపమున శరీరంబులు మఱచి జయోల్లాసము లుల్లసిల్ల
నాసళ్ళ బోడుము పెన్ జెమటలు మొత్తంబులును రక్తపూరంబులున్ బెరసి కాలు
వలై పాఱుచుండ మెఱుంగుకఱుటుంపగములు నాటినం జూఱుకొఱుంగక తమకం
బులను నిష్ఠురబాణసంఘట్టనంబులను బృహద్రథనేమిస్వనంబులను ద్విసమాస్త్రతురం
గహేషారవంబులను భటుల సింహనాదంబులను గగనంబునగుల జగంబులు కలంగ
సముద్రంబులు ఘూర్ణిల్ల ధాత్రివడంక దిగ్గజంబులు మొగ్గతిల్లఁబడ నభోభాగం
బున దేవగంధర్వసిద్ధసాధ్యకిన్నరకింపురుషాదులు చూచి వెఱంగుపడ నిది పగలిది
రాత్రియని యెఱుంగక తమకంబున నేడహోరాత్రంబులు పోరాడి యలసి బాణ
ప్రయోగంబు లుజ్జగించి యొకరినొకరు చూచుచుండ నవ్యవసరమున 83

క. సరసీరుహమిత్రాన్వయుఁ డరుదరుదని సురలు వొగడ నసురేశ్వరున
కున్నలములు శిరములు దెగిపడ నుగ్రాస్త్రంబు దీసివేసె నుగ్రాస్త్రములన్ 84

క. తెగిపడిన తలలు జేతులు దెగినట్లే మొల్చుచుండ ధీరాత్ముఁ డరన్
జానకీపతి ప్రభు మదిలో దెగకుంటుట చిత్రమనుచు దీర్ఘమతియున్ 85

క. ఒకకోల దలలు జేతులు బ్రకటముగ ద్రుంచ నంత బాహువు దలలున్
వికటంబున మొలచె సకలేశుండు వెఱఁగుపడె జన్యంబున నుంచెలన్ 86

క. తొడిగొడి శరములు ధరపై బడి మొలచు మస్తకము లేరుపడ నుండఁగ న
వ్వెడ రామమహీతలవరు, డెడతెగకుండఁగ నేసె నేమని చెప్పన్ 87

వ. అట్టి సమయమున 88

ఆ. పింజ దాఁకుగు శిరము వెడలెఁ శిరమును దిగు మొలచుతలలు దెగినతలలు
నెట్టివారికైన నెఱుగంగ రాకుండ రాముఁ జేయ గొడగె రణములోన 89

ఆ. శరము దొడిగి తివియ జక్రమువలెనుండు శరము విడుచునపుడు చాపము నను
జూడనొప్పె నార శోభితంబగు నాము త్రిల్లు నెప్ప జిత్రమగును 90

ఉ. కాంచనపుంఖదివ్యవిశిఖంబుల బాహులు మస్తకంబులున్
ద్రుంచిన ద్రుంచినట్లె కడుదేజ మెలర్పఁగ నుద్భవించు న
త్కాంచనరత్నభూషణనికాయము దీప్తులు ప్రజ్వరిల్లఁగా
గాంచనగర్భసృష్టవరగర్వవిశేషముచేత పారెకన్ 91

చ. పొరిబొరి ద్రుంచినన్ దిరిగి పుట్టెడి చందముగోల వారిపై
వెంపుగ బూను చందమును వేసెడు చందము బారుచందము
న్గరము నుతింపఁగా నరుఁడు గాడె తలంపఁగ దేవతావళికిన్
శిరముల చిత్రమున్ నృపతిచేతి విచిత్రము తూపుచిత్రమున్ 92

ఉ. రావణు దేయుబాణములు రామునిబాణము లొక్కపెట్టనన్
రావణు మేన నాటియును రాముని నాటియు రక్తపూరముల్
పూవులతోటిమోదుగ బూర్వగిరీంద్రముమీఁది భాను న
జేయుఁ బ్రకాండ కాంతుల సింధురమున్ దలపించు నంతయున్ 93

క. ఒత్తిలి రాముడు దైత్యుని కుత్తుక నొక్కకోల ద్రుంచి కూల్చుట దొడ్డో
నెత్తురు గ్రమ్మక మున్నే మొత్తముగ దలలు మరల మొలచుట దొడ్డో 94

వ. అని దేవసంఘములు గొనియాడ శ్రీరామచంద్రుండు దైత్యనాయకుని తలలు
జేతులుం ద్రుంచి త్రుంచి విసిగినంగని విభీషణుండు నరేంద్రున కిట్లనియె 95

ఉ. సంగరభూమి రావణుడు సత్త్వము దూలి ధరిత్రి గూలినన్
గ్రుంగె ధరంబునన్ ధరణి క్రుంగె గులాచలవర్గ మెల్ల వే
క్రుంగె దిశాకరీంద్రియముల్ గ్రుంగెడు మహోరగవంశనాథుడున్
గ్రుంగె ధులీమతీశ్వరుడు క్రుంగె వరాహము గ్రుక్కు తేలగన్ 107

క. జగములకు నెల్ల బాధకు డగు రావణు డాజి గూల నంతటితోడన్
బగ దీరె ననుచు తేఁ దన విల్లెక్కుడించి తమ్మని కిచ్చెన్ 108

సీ. అఖిలలోకమ్ముల కానంద మొదవెను సురలకంటికి నిద్ర సోకె నంత
మునులు చేసినతపంబులు చాలఫలియించె దొడరి శాఖ్యలకు దుందుభులు మ్రోసె
గుహ్యకావళికిని గూడు నోటికి బోయె సిద్ధులతలపులు సిద్ధి నొందె
దర్వీకరంబుల తల్లడం బడగెను గిన్నర సంఘంబుకీడు తొలగె

గీ. గరుడగంధర్వఖేచరగణములకును క్షేమ మింపారె జనపరిణామ మయ్యె
వేడ్క లింపొందె బాధలు విరుగడయ్యె సంగరంబున దైత్యుండు సచ్చుకతన.

ఉ. అంత విభీషణుండు తనయన్న పదంబులమీద వ్రాలి య
త్యంతవిషాదదుఃఖజనితాశ్రుకణంబులు రాల నేడ్చె లో
కాంతకు డైనరావణుమహాద్భుతపుష్పపరాక్రమంబు భూ
కాంతు నిముంగలన్ దడవి గద్గదకంఠకషాయనేత్రుడై 110

వ. అట్టి సమయమున మండోదరి మొదలయినయంతఃపురసుందరీసందోహంబులే తెంచి తమ ప్రాణేశ్వరుం డైనరాక్షసకులసార్వభౌముని గని వక్షంబులు శిరంబులు మోదు కొనుచు బహువిధముల బ్రలపింపుచు బరివేష్టించికొని యున్న భూకాంతుండు కాంతాలాపముల ననునయించి విభీషణుంగని నీవు దుఃఖముడిగి మీ యన్నకు నగ్ని సంస్కారాదివిధుల నాచరింపుమనిన నతం డట్లు కావించిన యనంతరంబ విభీషణుని లంకానగరంబునకుం బట్టము గట్టించిన నతడు సుగంధద్రవ్యంబులును నవరత్నఖచితంబులయిన భూషణములును జీనిచీనాంబరంబులును గానుకగా నిచ్చినం బరిగ్రహించి యవి యెల్లను మాతలి కిచ్చి పిత్రాజ్ఞాంతులం దనిపి యనిపిన నతండు స్వర్గంబునకుం జనియె నయ్యవసరమున 111

సీ. ఆలోన రాఘవుం డావిభీషణుం జూచి సద్భక్తియుక్తుడై సరగ బిలిచి
పంక్తికంధరు నాజి బరిమార్చితి నటంచు వసుమతీతనయకు వార్త సెప్పి
నీదేవి మొదలగు నీరజాక్షులచేత నతివకు శృంగారము మర జేసి
కొంచు రమ్మని చెప్ప నంచితగతి నేగి సరమాదిసతుల కాసరణి చెప్ప

గీ. సతులు నిర్మల జలముల జలకమార్చి పట్టుపుట్టంబు ముదమున గట్టబెట్టి
వందన మలంది సురభిపుష్పములు ముడిచి, మేలిమణిభూషణంబులు సాలదొడగి

క. ఇందిరతో సరియగు నా, సుందరిఁ ద్రైలోక్యమాత సొంపగొందగ నా
రందలమునఁగొనివచ్చిరి, కందర్పవిభుండు రాముకడకుం బ్రీతిన్. 113

వ. ఇట్లు గొనివచ్చి రామభూపాలుని సమ్ముఖంబున నునిచిన నద్ధరాతనూజాత పతికి
వినయభక్తితాత్పర్యంబులు తెలయఁబ్రణమిల్లిన నతండు వనితారత్నంబగు సీతం
గనుంగొని యిట్లనియె. 114

క. కులసతి జెఱగొనిపోయిన, యలశాత్రవు గెలువనోపఁడనుపలుకులకున్
గెలిచితిఁ బంపితి శంకన్ నెలతా! నీయిచ్చజనుము నేనొల్లన్ 115

గీ. అనుచు బలుకుపలుకు లవనీతనూజాత, కర్ణములకు వాఁడి గలుగునట్టి
నారసములు సోకి నాటిన యట్లయిన, సరసిజాక్షి మూర్ఛఁజాలనొంది. 116

చ. నరవర నాదు చిత్తము మనంబున నీవ యెఱింగియుండియున్
బరుషములాడ నేమిటికి పాపము నాయెడ లేదు కాదు పో
సురలు నుతింప మేటిసాదజొచ్చెద మెచ్చుడటన్న రామభూ
వరునిమనం బొడంబడిన వారిజలోచన సీత యాతతిన్. 117

క. హృదయేశుఁ డలర నప్పుడ, సాదఁ జొచ్చెను భూమిపుత్త్రి సురలు నుతింపన్
ముద మంది బద్మభవుఁడా యదనం బ్రత్యక్షమయ్యె నానానచున్. 118

గీ. అంతబద్మగర్భుడగు రామభద్రుఁజూచి పలికె బరమపురుష
వనజనేత్ర సీతవలన దోసము లేదు, నమ్మవసుమతీశ నాదుమాట. 119

వ. అనిపలికిన పితామహునిమాటల పక్షియసేనలును సంతసిల్లినవి. అనంతరమగ్నిభగ
వానుండు వయ్యంగనం గొనివచ్చి పరమపతివ్రతాభరణం బగునద్ధరాతనూజాతం
గైకొమ్మని యప్పగించిన నప్పుడ దశరథుండుప్రసన్నుండైనశ్రీరామచంద్రుండు
సతీసమేతుండై తమ్ముండును దానును నమస్కరించిన కుమారద్వయంబులు గౌఁగ
లిని నాలింగనంబుచేసి తద్దుఃఖంబులం బాపిచనియెనప్పుడు సకలదేవతలు నిట్లనిరి

క. మాకొఱకు జనన మొందితి, రాకాసులరాజుఁజంపి రక్షించితి వా
లోకంబులెల్లఁగృపతో, సాకేతపురాధినాథ! సజ్జనవినుతా. 121

క. అని వినుతిసేసి కలనన్, జనిపోయినకపుల నెల్లసత్కృపఁబ్రదుకుం
డని వరములిచ్చి యరిగిరి, ఘనులా దేవతలు మరలి గగనంబునకున్. 122

వ. తదనంతరంబున. 123

గీ. భానుపుత్త్రాదివానర బలముతోడ, ఘనవిభీషణముఖ్య రాక్షసులతోడ
మఱియు జానకితోడ లక్ష్మణునితోడఁ బుష్పకం బెక్కి చనియె నా రామి.

వ. ఇట్లు పుష్పకారూఢుండై చనుచుండి రామభూకాంతుండు తన కాంతార
నకు జేయెత్తి చూపుచు సంగ్రామస్థలంబిదే, రావణకుంభకర్ణాదులైన రాక్షసబల
బును మర్దించినతావి దేసు వేలాచలంబిదె సముద్రంబునఁ బంధించిన సేతుబంధనం
బిదె విభీషణుండు మమ్ముశరణు జొచ్చిన ప్రదేశం బిదె సుగ్రీవు కిష్కింధానగ
రంబిదె వాలిని నేలకూల చేసినచోటిదె భానునందనుడు మమ్ముఁ బొడగన్న
స్థలంబిదె ఋశ్యమూకాచలం బిదె వాయుతనూభవుండు మమ్ముఁ బొడగన్న తా
విదె పంపాసరోవరంబు నిదె కబంధుండను దానవుని వధించిన ప్రదేశంబిదె జటా
యువను పక్షీంద్రుండు రావణుండు నిన్నుఁ గొంపోవునప్పుడు రావణాసురునితోడం
బోరి మడిసిన స్థానంబిదె జనస్థానంబిదె దశవదనుండు నిన్ను జెఱగొనిపోయినచోటిదె
మాయామృగంబును బడనేసినచోటిదె ఖరదూషణాదులనాతోడఁ బోరి కూలిన
తావిదె శూర్పణఖ యను దాని ముక్కు సెవులుం జెక్కి సయిక్కయిదె సుతీక్ష్ణుం
డను మునీంద్రుండు వర్తించు నాశ్రమంబిదె యగస్త్యాశ్రమంబిదె యత్రిమహా
మునీంద్రునిపత్ని యనసూయాదేవి యంగరాగంబులు నీకిచ్చిన చక్కయిదె విరాధుం
డను రాక్షసుండు నిన్ను బట్టికొనిపోవుచుండ విడిపించినచోటిదె చిత్రకూటా
చలంబిదె భరతుండు మనల నొడంబఱిచి మరలం గొనిపోవవచ్చినచోటిదె గంగా
నది యల్లదె కనుంగొనుమని చెప్పుచు భరద్వాజాశ్రమంబుఁ జేరం జని యచ్చట
బుష్పకంబు డిగ్గి యమ్మునీంద్రునకు నమస్కరించిన నతండు రాముని దీవించి
మహానందంబు నొంది యనిలసంభవా! వేవేగ నీవేగి నందిగ్రామమ్మున నున్న భర
తునకు మారాక యెఱింగించి రమ్మని యంపిన. 127

క. అరుదెంచి చూచె భావని సురుచిరసౌభాగ్యభరతు శోభనచరితున్
విరచితపుణ్యస్ఫురితున్ నిరుపమసత్కీర్తినిత్యనిరతున్ భరతున్. 126

వ. కనుంగొని వందనంబు సేసి కరంబులు మోడ్చి వినయంబున 127

ఆ. భరతునకును రామభద్రుండు దెంచిన వార్త జెప్పవినుచు వాయుసుతుని
గారవించి నిండుకౌగిట జేర్చుచు నగ్రజుని క్షేమ మడిగి యడిగి.

గీ. సంచున్న యప్పుడన్నను భరతుండు సకలసేనాసమేతుండై తల్లులుం దమ్ముండును
నెదురెగి రాఘవేశ్వరుపాదారవిందంబులకు వందనం బాచరించిన నతం డనుజన్ములఁ

క. కౌఁగిలించుకొని లక్ష్మణసహితుండై జనకరాజనందనం గూడి తల్లులు ముప్పురకుం
బ్రణమిల్లినవార లతిస్నేహంబున నిండుగౌఁగిళ్ళనొత్తుచు దీవింప దమలో దాము
పెద్దపిన్న యంతరువులవందనంబులు సేసికొని మరలి నంది గ్రామంబునకేగి యచ్చట
పుష్పకంబు డిగ్గి దానికర్చనలిచ్చి కుబేరుపీటికి బొమ్మనియనిపి భరతుమందిరం
బుం బ్రవేశించె నట్టి శుభసమయంబున. 130

# న వ ల లు

| | | | |
|---|---|---|---|
| దొంగలరాణి | 1 0 | భయంకరబడాచోర్ | 1 0 |
| డిటో రెండవభాగం | 1 0 | డిటో రెండవభాగం | 1 0 |
| మోహిని | 1 0 | పంజాబుమెయిలు | 1 0 |
| పాతాళగృహం | 1 0 | ఘోరకలి | 1 0 |
| భా 2 గృహనాయకుడు | 1 0 | హాతింతాయి | 1 0 |
| చతురిక | 1 0 | మూకుచెప్పుదెబ్బలు | 1 0 |
| మిత్రద్రోహి | 1 0 | మోహినీపిశాచి | 1 0 |
| ఘోరప్రతిహింస | 1 0 | మన్మధసామ్రాజ్యము | 1 0 |
| విషమందిరము | 1 0 | అంతఃపురరహస్యాలు | 1 0 |
| డిటో రెండవభాగం | 1 0 | శయ్యాగారవింతలు | 1 0 |
| కూనీపైకూనీ | 1 0 | భయంకరనారీపిశాచి | 1 0 |
| బొంబాయికూనీ | 1 0 | ప్రతాపదౌర్జన్యం | 1 0 |
| చలిపిడుగు | 1 0 | చోరాగ్రేశచరిత్రము | 1 0 |
| రత్నమోహిని | 1 0 | సరళ | 1 0 |
| దొంగనోట్లు | 1 0 | వనదుర్గము | 1 0 |
| కళావరుజాకి | 1 0 | తపోవనము | 1 0 |
| మృత్యుమందిరము | 1 0 | జపమాలిక | 1 0 |
| రత్నజ్వాల | 1 0 | డిటో రెండవభాగం | 1 0 |
| వాడేవీడు | 1 0 | శిసుహత్య | 1 0 |
| రూపసుందరి | 1 0 | డిటో రెండవభాగం | 1 0 |
| యిందిర | 1 0 | డిటో మూడవభాగం | 1 0 |

ఇంకా మావద్ద నాటకములు, ప్రబంధములు, వైద్యగ్రంథములు జ్యోతిషగ్రంథములు, శతకములు, స్త్రీలపాటలు, వగైరా అవి యివి అననేల అన్నియు దొరుకును.

వలయువారు—

కురుకూరి సుబ్బారావు

సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.